# శ్రీరుధిరోద్గారి నామ సంవత్సర

## 1983-84 సిద్ధాన్తపంచాఙ్గమ్




తిరుమల తిరుపతి దేవ

ఓమ్

శ్రీయై నమః

శ్రీలక్ష్మీవేంకటేశాయ నమః

# శ్రీ రుధిరోద్గారినామ సంవత్సర

# సిద్ధాన్త పంచాఙ్గము

## 1983-84


తిరుమల తిరుపతి దేవస్థానముల ఆస్థాన సిద్ధాన్తి,

బ్రహ్మశ్రీ. దైవజ్ఞశేఖర, తంగిరాల చిన హనుమత్సిద్ధాంతి గారిచే విరచితము.

(వీరి పుత్రుడు ప్రభాకర పూర్ణయ్య సిద్ధాంతి సహాయ పంచాంగకర్త.)






తిరుమల తిరుపతి దేవస్థానముల ఆస్థాన పండితులు

తర్క-వేదాన్త మహావిద్వాన్, విద్యాభూషణ, ఆగమవిద్యాసార్వభౌమ,

అప్పికట్ల శ్రీమాన్ పండిత వేదాన్తం జగన్నాథాచార్యుల వారిచే పరిష్కృతము.



తిరుమల తిరుపతి దేవస్థానముల ఎగ్జిక్యూటివ్ ఆఫీసరువారగు

శ్రీ జి. కుమారస్వామిరెడ్డి, ఐ. ఏ. ఎస్. గారిచే ప్రకటింపఁబడినది.

తిరుపతి

1983

ఓమ్

## శ్రీవేంకటేశభగవాన్



ఓమ్॥ మత్పాదౌ శరణం వ్రజేతి చరణౌ సంసార సిన్ధుస్తరౌ
జానుం సంస్పృశతీతి జానుమపి పాణిభ్యాం స్వయం దర్శయన్।
శేషాద్రౌ జగతోఽస్యరక్షణధియాఽతిష్ఠద్దయా సాగరః
సశ్రేయాంసి చతుర్భుజః కలయతాం శ్రీ శ్రీనివాసః ప్రభుః॥

పణ్డిత వేదాన్తం జగన్నాథాచార్యః,
తిరుమల తిరుపతి దేవస్థానముల ఆస్థాన విద్వాన్

# శ్రీ రుధిరోద్గారినామ సంవత్సర
# సిద్ధాన్త
# పంచాఙ్గ పీఠికా

పంచాంగ కర్తలు:
దైవజ్ఞశేఖర
శ్రీ తంగిరాల చిన హనుమత్సిద్ధాంతిగారు,
తిరుమల తిరుపతి దేవస్థానముల ఆస్థాన సిద్ధాంతి,
(పూర్ణ జ్యోతిషాలయం)
రేలంగి — తణుకు తాలూకా,
పశ్చిమ గోదావరి జిల్లా (ఆంధ్ర.)

ఓమ్

## శ్రీ పద్మావతీదేవి



ఓమ్॥ ఈశానాం జగతోఽస్య వేంకటపతేర్విష్ణోః పరాం ప్రేయసీం
తద్వక్షస్థ్సలనిత్యవాసరసికాం తత్ క్షాంతిసంవర్ధినీమ్ ।
పద్మాలంకృతపాణిపల్లవయుగాం పద్మాసనస్థాం శ్రియం
వాత్సల్యాదిగుణోజ్జ్వలాం భగవతీం వందే జగన్మాతరమ్ ॥

ఓమ్

శ్రీరస్తు

శ్రీలక్ష్మీవేంకటేశః ప్రసన్నో భవతు

శ్రీ శ్రీనివాసాయ పరస్మై బ్రహ్మణే నమః

# * పీఠికారంభః *

ఓమ్॥ శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజమ్ । ప్రసన్నవదనం ధ్యాయేత్సర్వవిఘ్నోపశాంతయే ॥

యస్యద్విరదవక్త్రాద్యాః పారిషద్యాః పరశ్శతమ్ । విఘ్నం నిఘ్నంతి సతతం విష్వక్సేనం తమాశ్రయే ॥

శ్రీమాన్ శ్రీశేషపృథ్వీధరశిఖరపరిస్పందిపాదారవింద-
ద్వంద్వో మందీకృతేందుద్యుతిరుచిరుచిరస్వావతంసప్రపంచః తనోతు ।
లక్ష్మీం లక్ష్మీవియోగాసహనిజహృదయః కోఽపి కారుణ్యపూర్ణో
దేవాధీశః ప్రఫుల్లాంబుజదళనయనస్సర్వదా సర్వదో వః ॥

కందర్పకోటి సదృశం కమనీయవేషం ముక్తావళీలలితకంఠముదారహారమ్ ।
పీతాంబరద్యుతి విరాజిత దివ్యదేహం శ్రీ వేంకటేశ వపురాత్మని సన్నిధత్తామ్ ॥

మానాతీత ప్రథిత విభవాం మంగళం మంగళానాం
వక్షఃపీఠీం మధువిజయినో భూషయన్తీం స్వకాన్త్యా ।
ప్రత్యక్షానుశ్రవిక మహిమ ప్రార్థినీనాం ప్రజానాం
శ్రేయోమూర్తిం శ్రియమశరణస్త్వాం శరణ్యాం ప్రపద్యే ॥

శ్రీవిష్ణుచిత్తకులనందనకల్పవల్లీం శ్రీరంగరాజహరిచందనయోగదృశ్యామ్ ।
సాక్షాత్ క్షమాం కరుణయా కమలామివాన్యాం గోదామనన్యశరణశ్శరణం ప్రపద్యే ॥

నిశదోర్ధ్వపుండ్రవిలసన్ముఖాంబుజం లలితోపవీతకలితోరువక్షసమ్ ।
కరపద్మవజ్రకలితత్రిదండకం కలయే యతీంద్రమహనీయవిగ్రహమ్ ॥

ఆరోగ్యం పద్మబంధుర్వితరతు సతతం సంపదం శీతరోచిః
భూలాభం భూమిపుత్రస్సకలగుణయుతాం వాగ్విభూతిం చ సౌమ్యః ।
సౌభాగ్యం దేవమంత్రీ వితరతు సతతం భార్గవశ్శౌర్యమార్కిః
ధైర్యం రాహుశ్చ కీర్తిం సకలభయహరాం కేతురిష్టార్థసిద్ధిమ్ ॥

అబ్దాదౌ బంధుసంయుక్తో మంగళస్నానమాచరన్ । వస్త్రైరాభరణైర్దేహమలంకృత్య తతశ్శుచిః ॥

శ్రీవేంకటాచలాధీశం శ్రీనిధిం కరుణానిధిమ్ । నమస్కృత్య హృషీకేశం యతిరాజం చ నిత్యశః ॥

సంవత్సరఫలం సమ్యగ్యశ్శృణోత్యేకమానసః । దద్యుర్మనోరథం సర్వం దేవతాః ఫలముత్తమమ్ ॥

జ్యోతిశ్శాస్త్రం మహాపుణ్యం ప్రమాణత్వేన నిశ్చితమ్। చంద్రార్కౌ తత్ర సాక్షిత్వం భజేతే నిశ్చలం యతః॥

యథా శిఖామయూరాణాంనాగానాంమణయోయథా। తథా వేదాంగశాస్త్రాణాం జ్యోతిషం మూర్ధ్నిసంస్థితమ్

శ్రీవత్స జన్మాఽఖిల సౌరతంత్ర సిద్ధాంత విజ్ఞానమతిర్హనూమాన్ ।
శ్రీ తంగిరాలాన్వయజోఽహమార్యాః శ్రీ శేషశైలేశ కృపావిశేషః ॥

సోఽహం యథామతి మతాని విమృశ్య విద్వదాచారరీతిమవిలంఘ్య గురూపదేశమ్ ।
శ్రీ వేంకటేశకృపయా వితనోమి సాంగం పంచాంగమత్ర విబుధాస్సదయా భవంతు ॥

## గురువందనమ్

దైవజ్ఞ ప్రథమస్య పూర్ణ యశసశ్శ్రీబాలపూర్ణస్య యః
పుత్రశ్శ్రీపిడపర్తి వంశజని సుబ్రహ్మణ్యశాస్త్రీ కృతీ ।
సూర్యార్యాదిపురాతనాద్యతనసిద్ధాంతేషు గోలాదివి-
త్రిస్కంధాంబుధిపారగో మమ గురుః వందే సదా శ్రేయసే ॥

## దైవజ్ఞ ప్రశంసా, దైవజ్ఞ నివాసః

శ్రీ వేంకటేశా ప్పనృసింహహాటకేశాదిదేవైరభిరక్షమాణమ్ ।
గోదావరీ పశ్చిమయోజనాంతర శ్రీగోస్తనీతీరవిరాజమానమ్ ॥

శ్రీ వేదవేదాంగవిదుత్తమైర్బుధైః జ్యోతిర్విదగ్రేసర పండితైశ్చ ।
ఈడ్యైర్వదాన్యైరభిభూషితం చ చకాస్తి రేలంగిపురం సురమ్యమ్ ॥

యద్వంశే బహవశ్శ్రుతిస్మృతివిదా సజ్జ్యోతిషే పండితాః
శ్రీవత్సాభిధగోత్రజాస్తదనుమత్ప్రైతామహోఽత్యంతధీః ।
శ్రీమత్పండితసార్వభౌమహనుమాన్వేదార్థవిత్సాత్త్విక-
స్తత్తత్కర్మసుకాలనిర్ణయకృతే పంచాంగకర్తా పురా ॥

తస్యాత్మజో వేంకటకృష్ణసోమయాజీమసిద్ధాన్తవిదగ్రగణ్యః ।
శ్రీరామభక్తః ప్రతివత్సరం సత్పంచాంగమత్యంతముదాఽకరోచ్చ ॥

జ్యాయాన్ వేంకటహనుమాన్ ద్వైతీయీకస్తు పూర్ణదైవజ్ఞః ।
తార్తీయోఽహం హనుమాన్ వేంకటకృష్ణాఖ్యదైవవిత్పుత్రాః ॥

ఆమార్యం చ్యవనోంగిఽరోఽత్రిముఖరావత్యర్చమాన్యా-
న్మనీనాచార్యావవరాన్మయా హనుమతా శ్రీతాతపాదం గురుమ్ ।
పంచాంగం విరచయ్య వేంకటవిభోః పాదాబ్జయోరర్పితం
సశ్శ్రేయాంసి దయామయః కలయతాం శ్రీ వేంకటేశః ప్రభుః ॥

తిరుమల తిరుపతి దేవస్థానముల ఆస్థాన సిద్ధాంతి

## శ్రీ తిరుపతి (వేంకటాద్రి) నగర్యాః

విషువచ్ఛాయాంగుళాని 2–55.    అక్షాంశాః + 13–44.

భూమధ్యాత్ దేశాంతరకాలః ఘ॥ + 0–29 గం + 0–12.
అయనాంశాః భా 23°–33'–57''

### స్ఫుటలగ్న ప్రమాణ పుష్కరకాలాః

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| మేషస్య | 4–28 | = | 3–8 | తులాయాః | 5–18 | = | 4–14 |
| వృషభస్య | 5–4 | = | 2–22 | వృశ్చికస్య | 5–31 | = | 1–17 |
| మిథునస్య | 5–30 | = | 4–24 | ధనుషః | 5–19 | = | 3–43 |
| కర్కాటకస్య | 5–26 | = | 1–16 | మకరస్య | 4–44 | = | 2–13 |
| సింహస్య | 5–10 | = | 3–38 | కుంభస్య | 4–14 | = | 3–23 |
| కన్యాయాః | 5–6 | = | 2–23 | మీనస్య | 4–8 | = | 0–58 |

ఈ లగ్న ప్రమాణములు ఈ కాలమునకు తిరుపతికి చేయబడినవి. ఇవియే స్ఫుటలగ్న ప్రమాణములుగ గ్రహించవలెను. తిరుపతి ప్రాంతములలోని అలవాటులో ఉన్న లగ్న ప్రమాణములు. ప్రాచీన కాలములో సాధింపబడినందున సరిగ్రాహ్యములుగావు.

### తిరుపతి నుండి రాజమండ్రికి దేశాంతరకాలము.

| సాయన మాసము → | మేష | వృషభ | మిథున | కర్కాటక | సింహం | కన్య |
|---|---|---|---|---|---|---|
| | +౩౨ | +౩౯ | +౪౩ | +౪౦ | +౪౩ | +౩౯ |
| | తులా | వృశ్చిక | ధనుః | మకర | కుంభ | మీన |
| | +౩౨ | +౨౪ | +౧౯ | +౧౬ | +౧౯ | +౨౪ |

పై సంస్కార విఘడియలను తిథ్యాదికమునందు మేషాది సాయన మాసారంభదినమున సంస్కరించగా రాజమండ్రికి సూర్యోదయాదికాల మగును. మాసాదినుండి తిరిగి మాసాంతము వరకు అనుపాతముచే మధ్య దినములందు సంస్కరింపవలెను.

## అథ బ్రహ్మణః ఆయుఃప్రమాణాదికం

శ్రీమద్భగవద్దివ్యనాభీకమలజాతస్య పరార్థద్వయజీవినః చతుర్ముఖస్య బ్రహ్మణః పరమాయుర్వర్షశతమేవ । తత్ప్రమాణసౌరాబ్దాః 31104000 కోట్లయః । వర్తమానస్యబ్రహ్మణః పరాఖ్యస్యాయుషః అర్ధంగతం । ద్వితీయపరార్థే ప్రథమవాసరే గతఘట్యాదయః । ఘ॥ 17 విఘ॥ 42 ప్రాణకాల(ం)గుర్వక్షరోచ్చారకాలః 3 నిమేష 19 ల వ 18 త్రుటయః 86 సంప్రతి సప్తవతిత మేత్రుటౌగత సౌరమాసాదయః 1-18-10-0. బ్రహ్మణః సౌరమానేన వయోగతవత్సరాః 1,55,52,195,84 వత్సరాః । ఇదానీం శ్వేతవరాహకల్పే స్వాయంభువాద్యాః షణ్మనవో గతాః । సప్తమే వైవస్వతమన్వంతరే 27 మహాయుగాని గతాని । మహాయుగ ప్రమాణ సం॥ 4320000, కృతయుగ ప్ర. సం॥ 1728000, త్రేతాయుగ ప్ర. సం॥ 1296000, ద్వాపరయుగ ప్ర. సం॥ 864000, కలియుగ ప్ర. సం॥ 432000, సృష్టికాలాత్ప్రగృహ్య వ్యాసగతవత్సరాః 193,58,85,084, కలియుగే గతాబ్దాః 5084, శాలివాహనశకే గతాబ్దాః 1905, విక్రమశకే గతాబ్దాః 2040, ఇంగ్లీషు 1983-1984.

మహాయుగము అనగా 4320000 సంవత్సరముల పరిమాణముగలది. అది కృత, త్రేతా, ద్వాపర, కలియుగములు అనునామములతో విభాగింపబడి వ్యవహరింపబడుచున్నది. "యుగం భవేత్ వత్సరపంచకేన యుగాని తు ద్వాదశ వర్షషష్ట్యాం" ఇత్యాది శాస్త్రవచనములు. ప్రభవాది షష్టిసంవత్సరములలో అయిదు సంవత్సరములు ఒకయుగము. అట్టియుగసంఖ్యచే షష్టిసంవత్సరములు ($5 \times 12 = 60$) 12 యుగములుగానగుచున్నవి అని చెప్పుచున్నవి. అట్లు యుగముగానైన అయిదు సంవత్సరములను గూర్చి కృష్ణయజుర్వేదము (తైత్తిరీయ బ్రాహ్మణము) కాఠకప్రశ్నము నాల్గవ అనువాకమునందు.

"సంవత్సరో౽సి[1], పరివత్సరో౽సి[2], ఇదావత్సరో౽సి[3], ఇదువత్సరో౽సి[4], ఇద్వత్సరో౽సి[5]" వత్సరో౽సి[6] ॥ ఇతి ॥ ఇట్లు చెప్పుచున్నది.

ఇందులకు విద్యారణ్యభాష్యము,

ప్రభవాదిషు షష్టిసంవత్సరేషు ఏకైకస్మింశ్చ క్రమేణ సంవత్సర పరివత్సరాది శబ్దాః వర్తన్తే, ................................................ పంచస్వేతేష్వనుగతాకారః వత్సరః । ఏతద్రూపో౽సి, ఏవమంగిరశ్శ్రీముఖ భావ యుగాదిషు ఏకాదశసు పంచకేషు యోజయితవ్యం ॥ ఇతి ॥ అని చెప్పుచున్నది.

అనగా, ప్రభవాది అయిదు సంవత్సరములు, "సంవత్సరము, పరివత్సరము, ఇదావత్సరము ఇదువత్సరము, ఇద్వత్సరము" అను నామములుకలవై యున్నవి. ఇటులనే మిగతా ప్రతి అయిదు సంవత్సరములకు నామములను తెలియదగియున్నది. ఇటుల లెక్కించిన ఈ రుధిరోద్గారినామసంవత్సరము ప్రభవాదిగా 57 వ సంవత్సరమగుటచే పన్నెండవ యుగములో ద్వితీయ వత్సరమగుచున్నది. దీనిని పరివత్సర శబ్దముచే వైదికులు వ్యవహరించుచున్నారు. ఇది సూర్య దేవతాకమగుచున్నది — పరివత్సరమని పేరుగల ఈ సంవత్సరమున యవదానము విశేష ఫలదమగును.

దయాసముద్రుడగు శ్రీ వేంకటేశప్రభువు యొక్క అనుగ్రహ పాత్రులగు వారలకు అన్నియు శుభప్రదములుగాను సుఖప్రదములుగాను ఉండునని తలంచవలసియున్నది.

శ్రీ వేంకటేశ్వరాయ నమః

# శ్రీ రుధిరోద్గారినామ సంవత్సర పంచాఙ్గ పీఠికా

కల్యాద్యబ్దాః ౫౦౮౪, శాలివాహన శకాబ్దాః ౧౯౦౫, విక్రమార్క శకాబ్దాః ౨౦౪౦, శ్రీ శంకరాచార్యాస్వామ్యవతారాబ్దాః ౨౦౫౬, శ్రీ రామానుజస్వామ్యవతారాబ్దాః ౯౬౭, శ్రీమధ్వాచార్యావతారాబ్దాః ౭౬౬, ఫసలీశకాబ్దాః ౧౩౯౨-౯౩, హిజరీశకాబ్దాః ౧౪౦౩-౧౪౦౪, ఇంగ్లీషు 1983-84, భారతీయస్వతంత్రాబ్దాః ౩౭, ప్రభవాదిగతాబ్దాః 57, ఏష్యాబ్దాః 3.

## సంవత్సర ఫలము

ఈ సంవత్సరమందు సంవత్సమందు-రాజు-గురుడు, మంత్రియు-గురుడు, సైన్యాధిపతియు, ధరల కధిపతియు, మేఘాధిపతియు - బుధుడు, సస్యాధిపతి - సూర్యుడు, రసద్రవ్యాధిపతి - కుజుడు, నీరసద్రవ్యాధిపతి - శని, పశుపాలకుడు - శ్రీకృష్ణుడు, గోష్ఠాగార ప్రావకుడు, గోష్ఠ బహిష్కర్తయు - బలరాముడు, 4 కుంచములు వర్షము, 8 వీసములు ఫలించును, 8 భాగములు సముద్ర ప్రదేశములందును, 8 భాగములు పర్వత ప్రదేశములందును, 3 భాగములు భూమియందును వర్షించును ధరలు హెచ్చుస్థాయిలో నుండును బహుదేశములందు సుభిక్షములు గల్గి వుండును.

## మౌఢ్య నిర్ణయము

శ్రావణ శుద్ధ ౧౨ శని (20-8-1983) లగాయితు శ్రావణ బ ౬ మంగళ (30-8-1983) వరకు వరకు శుక్రమౌఢ్యము. కార్తీక బ ౧౨ గురు (1-12-1983) లగాయితు మార్గశిర బ ౯ మంగళ (27-12-1983) పర్యంతము గురుమౌఢ్యము.

## కర్తరీ నిర్ణయము

చైత్ర బ ౬ బుధ (4-5-1983) లగాయితు వైశాఖ బ ౨ శని (28-5-1983) వరకు వాస్తు కర్తరి.

## పుష్కరనిర్ణయము

మార్గశిర బ॥ ౩ గురు॥ ౯ (22-12-1983) న శ్రీ పుష్కరిణినదీ పుష్కర ప్రారంభమగును

1983 ఏప్రిల్ 14 తేదీని చాంద్రమాన శ్రీ రుధిరోద్గారి సం॥రం ప్రారంభమగును.

14-4-1983 తేదీని సౌర సంవత్సర ప్రారంభమగును.

22-3-1983 తేదీని 1905 శాలివాహనశక ప్రారంభమగును.

తిరిగి 21-3-1984 సంవత్సరమున 1906 శాలివాహనశక ప్రారంభమగును.

17-1-1983 (గత దుందుభి సం॥ర పుష్య శుద్ధ ౩ సోమవారము సావన వర్షారంభము.

## కార్తి ప్రవేశములు – వర్షనిర్ణయము

| 1983 | | నక్షత్రము | | | గం. వి. | సారాంశము |
|---|---|---|---|---|---|---|
| మే | 11 | కృత్తిక | రా | గం. | 7–49 | సువృష్టిః |
| | 25 | రోహిణి | సా. | గం. | 5–11 | అనావృష్టిః |
| జూన్ | 8 | మృగశిర | సా. | గం. | 4–40 | అనావృష్టిః |
| | 22 | ఆర్ద్ర | సా. | గం. | 5–41 | అతివృష్టిః |
| జూలై | 6 | పునర్వసు | రా. | గం. | 7–25 | అతివృష్టిః |
| | 20 | పుష్యమి | రా. | గం. | 8–56 | అతివృష్టితుల్యః |
| ఆగస్టు | 3 | ఆశ్లేష | రా. | గం. | 9–17 | సువృష్టిః |
| | 17 | మఘ | రా. | గం. | 3–00 | స్వల్పవృష్టిః |
| | 31 | పుబ్బ | రా. | గం. | 9–23 | సువృష్టిః |
| సెప్టెం | 14 | ఉత్తర | ప. | గం. | 10–19 | అనావృష్టిః |
| | 27 | హస్త | రా. | గం. | 1–19 | సువృష్టిః |
| అక్టో | 11 | చిత్ర | ప. | గం. | 1–33 | స్వల్పవృష్టిః |
| | 24 | స్వాతి | రా. | గం. | 11–21 | సువృష్టిః |
| నవం | 7 | విశాఖ | ఉ. | గం. | 6–27 | అతివృష్టిః |
| | 20 | అనూరాధ | ఉ. | గం. | 11–25 | అనావృష్టిః |

ఇవి ప్రాయికముగ సరిపడును. మరియు పీఠికలలో వర్షయోగ ఫలములను గమనించవలెను.

| | | |
|---|---|---|
| 11 శ, 12 రా | కుబు 10 | ర చం 9 8 |
| 1 ల | వర్షలగ్నము | 7 |
| 2 3 | శ 4 | కే 6 గు 5 |

| | | |
|---|---|---|
| 1 2 శు రా ల | చం కు బు 12 | ర 11 10 |
| 3 | జగల్లగ్నము | 9 |
| 4 5 | శ 6 | కే 8 గు 7 |

### జగల్లగ్న, వర్షలగ్న ఫలితములు

పై లగ్నములను విచారించగా తూర్పుదేశములందు యుద్ధభయమును, ఉత్తరదేశమందు ధాన్యోత్పత్తియు, దక్షిణదేశమందు కాలఫలితములు వ్యత్యయముగను కలుగు సూచనలు గలవు. మేష, మిథున, ధనుర్మీనములందు దోషములు కన్పట్టుటచే జనవిరోధములు, అకాల మరణములు, లంచగొండి తనములు, స్త్రీలయందత్యాచారములు జరుగును. వర్షలగ్నమునకు వ్యయమందు జగల్లగ్నమునకు ధనస్థానమందు రాహువుండుటచే, దేశమునకు ఆదాయము లభించినను ధనమాంద్యము, అననవర

వ్యయములు, ధనాగారముల (బ్యాంకుల) దోపిడీలు, చోరభయములు కలుగును. లగ్నాధిపతులు, లగ్నములు లగ్నములకు శుభగ్రహవీక్షణలు, లగ్నాధిపతులకు శుభస్థానస్థితులు మరియు శుభార్గళ ఫలితముల బట్టి దేశము యిదివరకటికంటె పారిశ్రామిక రంగములోను, వ్యవసాయరంగములోను, మంచిపురోభివృద్ధినొందును. రాజకీయములు, పరిపాలనాగరిమ శుభప్రదముగాను, జనులకు సౌఖ్యము విస్తృతవిగాను మందును.

## దేశారిష్ట యోగములు

(1) జ్యేష్ఠ బ ౩ ప్ర॥ ఆషాఢ శుద్ధ ౨ ప్ర॥ మిథునే చాతుర్గ్రహకూటః - వర్షప్రతిబంధకములు, ఉప్పెనలు, యుద్ధసూచనలు.

(2) జ్యేష్ఠ బ ౩ ప్ర॥ కార్తీక బ ౧౦ ప్ర॥ కాలసర్పయోగః - దుర్భిక్షము, కోస్తాతీరమందు తుఫానులు. సస్యనష్టము.

(3) మార్గశిర బ ౧౦ ప్ర॥ ఫాల్గుణ శుద్ధ ౪ ప్ర॥ తులాయాం కుజస్తంభాఖ్యయోగః - మందారాంగారకయుతిః - దుర్భిక్షము, చోరభయము, రాజకీయకల్లోలములు.

## శ్రీరుధిరోద్గారినామ సం॥ర ఫలితాంశములు

ఈ సంవత్సరమున రాజు-గురుడు, మంత్రి-గురుడు, సేనాధిపతి, అర్ఘాధిపతి, మేఘాధిపతి-బుధుడు, సస్యాధిపతి-రవి, ధాన్యాధిపతి-శుక్రుడు, రసాధిపతి-కుజుడు, నీరసాధిపతి-శనియు నైరి. అనగా నవనాయకులలో ఆరుగురు శుభులై యుండిరి. ముగ్గురశుభులైరి. ఇరువదెనిమిదిమంది ఉపనాయకులలో పదునెనిమిదిమంది యశుభులైరి. వర్షలగ్నము కర్కాటకము, జగల్లగ్నము వృషభములైనవి. తత్కారణమున పర్యాలోచించగా శుభార్గళ శుభగ్రహ వీక్షణలచే దేశమందు పారిశ్రామికాభివృద్ధి వ్యవసాయరంగమందు పురోభివృద్ధి, పరిపాలనా పాటవము నిర్దుష్టముగా సంచరించినను దుష్టగ్రహసంపత్తి, దుష్టగ్రహవీక్షణలచే, మేషమిథున ధనుర్మాసములందు తూర్పుదేశములందు యుద్ధభయములు, అకాలమరణములు బ్యాంకుల దోపిడీలు, స్త్రీలయందత్యాచారములు, లంచగొండితనము మొదలగు దుష్టఫలితములు దృఢముగా కన్పట్టుచున్నవి. విలాసవస్తువుల ధరలు ఇంచుక విలబాటు పొందును.

మరియు నీ సంవత్సరమునందు చాతుర్గ్రహకూట కాలసర్పయోగాదులచే ఉత్తర భారతంబున ప్రజాకల్లోలములు, మధ్య భారతంబున మధ్య వర్షంబులు, దక్షిణ భారతంబున అతివృష్టియు సంభవించును. ఈ సంవత్సరంబున చాంద్రయోగముచే "రుధిరోద్గారి" వత్సరమనియు, బార్హస్పత్యమానంబుచే ధాతృనామసంవత్సరమనియు, గురూదయాబ్దంబున జ్యేష్ఠాబ్దమనియు, పంచవత్సరాత్మకంబున పరివత్సరనామకమనియు పిలువబడుచున్నది. ఈ వర్షలగ్నమునకు రవి అధిపతి అగుటచే ఇందు యవదానము చేయుట ప్రశస్తమైనది. చైత్రాదిమాసత్రయంబున వేడిగాడ్పులు, ఉడుకు జల్లులు, ఆషాఢాది మాసత్రయంబున సువృష్టియు, ఆశ్వయుజాది మాసత్రయంబున వాయుమిశ్రిత వృష్టియు, పిమ్మట సాధారణ వాతావరణంబును కల్గును. జ్యేష్ఠ శుద్ధ పంచమీప్రాంతంబున తొలకరి వర్షములు కురియును. ఈ సంవత్సరము 4 కుంచముల వర్షము. అందు 8 భాగములు సముద్రములందును, 9 భాగములు పర్వతములందును 3 భాగములు భూమియందును వర్షించును. 4 అరకముల వాయువుపీచి, 8 పీనముల పంటఫలించును.

## అబ్దత్రయనిరూపణమ్

అస్మిన్ దేశే లోకవ్యవహారార్థం చాంద్రసౌరమానాబ్దో గ్రాహ్యః। చాంద్రమానేన చైత్ర శు ౧ గురువాసరే తత్సరారంభః। దక్షిణదేశే సౌరమానాబ్దో గ్రాహ్యః। సౌరమానేన చైత్ర శు ౧గురువాసరే సౌరవత్సరారంభః। చాంద్రసౌరమానాభ్యాం రుధిరోద్గారినామ సంవత్సరః। వింధ్యస్యోత్తరదేశే బార్హస్పత్యమానాబ్దో గ్రాహ్యః। బార్హస్పత్యమానేన గత దుందుభినామ సంవత్సరే ఫాల్గుణ బ ౧ మంగళవార ప్రభృతి ఏతత్సంవత్సర ఫాల్గుణ శు ౧౩ శనివార పర్యంతం ధాతృనామ సంవత్సరః। తదూర్ధ్వం ఈశ్వరనామ సంవత్సరః। గురూదయవశాత్ అస్మిన్నబ్దే జ్యేష్ఠాబ్దః॥

### సౌర, చాంద్రమానాబ్దఫలం

శ్లో॥ చిత్రవర్షైశ్చిత్రధాన్యైర్ధరణీ రాజతే ప్రజాః।
రాజానశ్చ భయం యాంతి రుధిరోద్గారివత్సరే॥

తా॥ ఈ రుధిరోద్గారి సంవత్సరమందు చిత్రమగు వర్షములు కురిసి, చిత్రమైన ధాన్యములు ఫలించును, రాజులు, ప్రజలు భయకంపితులయ్యెదరు.

### బార్హస్పత్యమానాబ్దఫలం

శ్లో॥ అబ్దే ధాత్రౌ నిఖిలాధరిత్రీప్రదాయినీ సర్వజనేప్సితార్థాన్।
భూదేవ భూ భృన్నికరాశ్చ సర్వేమఖక్రియాద్యుత్సవ తత్పరాః స్యుః॥

తా॥ ఈ సంవత్సర మంతయు ప్రజలు కోరిన కోరికలు ఫలించును. బ్రాహ్మణులు, రాజులు యాగములు చేయుటయందాసక్తిగల వారగుదురు.

### గురూదయాబ్దఫలం

శ్లో॥ జ్యేష్ఠాబ్దే ధర్మమార్గస్థాః పీడితాశ్చ నృపాః పరైః।
వృక్షగుల్మలతావృద్ధిర్సవేత్సస్య వినాశనమ్॥

తా॥ జ్యేష్ఠాబ్ద ఫలితంబున ధర్మస్వభావులగు రాజులు శత్రుపీడితు లయ్యెదరు. వృక్ష, లత, గుల్మాదులు వృద్ధినొందును, సస్యములు నశించును.

### శ్రీ రుధిరోద్గారి సంవత్సరస్య రాజాది నిర్ణయః

| | | |
|---|---|---|
| రాజా - గురుః | సస్యాధిపతిః - సూర్యః | మేఘాధిపతిః - బుధః |
| మంత్రీ - గురుః | ధాన్యాధిపతిః - సూర్యః | రసాధిపతిః - కుజః |
| సేనాధిపతిః - బుధః | అర్ఘాధిపతిః - బుధః | నీరసాధిపతిః - శనిః |

### ఉపనాయక నిర్ణయః

| | | |
|---|---|---|
| పురోహితః - సూర్యః | పశూనామధిపతిః - బుధః | మృగాధిపతిః - బుధః |
| పరీక్షకః - శనిః | దేవాధిపతిః - సూర్యః | శుభాధిపతిః - గురుః |

గణకః - శనిః
గ్రామపాలకః - గురుః
దైవజ్ఞః - సూర్యః
రాష్ట్రాధిపతిః - గురుః
సర్వదేశోద్యోగాధిపతిః - గురుః
అశ్వాధిపతిః - గురుః
గజాధిపతిః - సూర్యః

నరాధిపతిః - బుధః
గ్రామనాయకః - శనిః
వస్త్రాధిపతిః - కుజః
రత్నాధిపతిః - గురుః
వృషాధిపతిః - శుక్రః
జంగమాధిపతిః - శని
సర్పాధిపతిః - చంద్రః

స్త్రీణామధిపతిః - బుధః
వర్షలగ్నము - కర్కాటకః
వర్షలగ్నాధిపతిః - చంద్రః
జగల్లగ్నం - వృషభః
జగల్లగ్నాధిపతి - శుక్రః
17–1–1983 సోఃరే సావవ వర్షారంభః.
సావవ వర్షాధిపతిః–చంద్రః.

## వర్ష ధాన్యాది ప్రమాణములు

వర్షం ౧౧, ధాన్యం ౧౫, శీతం ౧౩, తృణం ౧౮, ఉష్ణం ౧౭, మారుతం ౪, ప్రజావృద్ధి ౮, నాశః ౮, రాజవిద్వరం ౧౮, ఉగ్రం ౫, పుణ్యం ౫, పాపం ౫, వ్యాధి ౭, ఉపశమనం ౧౭, ఆదారం ౧౭, అనాదారః ౧౮, మరణాని ౫, జన్మాని ౧౫, దేశోపప్లవః ౧౭, దేశస్వాస్థ్యం ౧౩, చోరభయం ౧౭, నాశః ౫, అగ్నిభయం ౮, నాశః ౧౧, మృగోపద్రవం ౧౭, నాశః ౧౫, కీటకవృద్ధి ౧౮, నాశః ౭, మహిషవృద్ధిః ౭, నాశః ౧౭, సర్పవృద్ధిః ౩, నాశః ౧౭, కామః ౧౧, లోభః ౧౫, మోహః ౧౫, మదః ౧౧, మత్సరః ౨౧, సుఖం ౧౧, దుఃఖం ౧౩, భోగః ౧౮, విడంబః ౧౭, మనోవ్యథా ౧౭, ద్వేషః ౧౮, ప్రతిష్ఠా ౧౭, అప్రతిష్ఠా ౭, ద్యూతః ౧౭, ప్రమాదః ౧౧, నరోత్పత్తిః ౧౭, స్త్రీఉత్పత్తిః ౭, ధాతువాదః ౧౫, భయం ౨౧, శౌర్యం ౭, దుష్టనిగ్రహః ౧౩, శిష్టప్రతిపాలనం ౧౮, సత్యం ౨౧, అసత్యం ౮, విశ్వాసః ౭, అవిశ్వాసః ౧౧, దయా ౧౩, నిర్దయా ౧౫, న్యాయః ౧౮, అన్యాయః ౧౭, గోమాయువృద్ధి ౧౧, నాశః ౫, సస్యకీటక ౧౧, నాశః ౫, శలభ ౧౧, నాశః ౧౧, మశక ౮, నాశః ౩, మత్కుణః ౩, నాశః ౮, వృశ్చికః ౭, నాశః ౧౧, వ్యాఘ్రః ౧౧, నాశః ౩, సస్యవృద్ధి ౭, నాశః ౬, శుకః ౮, నాశః ౬, పికః ౫, నాశః ౮, కుక్కుట ౯ నాశః ౯ ఖగవృద్ధి ౨, నాశః ౪, గోవృద్ధిః ౩, నాశః ౪, మహిష ౫, నాశః ౧, మృగ ౫, నాశః ౨, అజ ౬, నాశః ౬, అశ్వ ౫, నాశః ౩, గజ ౫, నాశః ౬, ఉష్ట్రం ౪, నాశః ౬, విప్ర ౫, నాశః ౨, క్షత్రియ ౩, నాశః ౫, వైశ్య ౪, నాశః ౫, శూద్ర ౪, నాశః ౬, మ్లేచ్ఛ ౫, నాశః ౩, సంకర ౨, నాశః ౫ వజ్ర ౩, వైఢూర్య ౫, గోమేధిక ౫, పుష్యరాగ ౨, మరకత ౩, మాణిక్యం ౪, నీల ౫, మౌక్తిక ౧, ప్రవాళ ౧, సువర్ణ ౬, రజిత ౧౦, తామ్ర ౯, కాంస్య ౧౨, లోహ ౧౪, అయో ౬, త్రపు ౨, సీసం ౨, రస ౧౨, జ్ఞానం ౮, అజ్ఞానం ౧౭, కావట్యం ౧౩, నిష్కాపట్యం ౭, ధార్మికత్వం ౧౮, అధార్మికత్వం ౧, (౯) విద్యుత్ ౩, (౬) శిలాపాతః ౩, స్వప్నం ౬, సుషుప్తి ౧౨, జాగ్రత్ ౯, అండజ ౯, నాశః ౧౫, స్వేదజ ౧౩, నాశః ౧౮, ఉద్బిద ౧౭, నాశః ౧౧, జరాయుజ ౮, నాశః ౮, వ్రీహి ౧౦, శాలి ౧౨, కులుద్ధ ౧౨, తిల ౧౯, మాష ౧౪, ముద్గ ౧౬, సర్షప ౪, చణక ౧౦, ఆఢక ౪, గోధూమ ౧౨, కోద్రవ ౪, ప్రియంగు ౧౦, యావనాళ ౧౨, శ్యామక ౧౪, రాజమాష ౧౬, నీవార ౧౨, శింబి ౨, అతివృష్టి ౧౩, అనావృష్టి ౧౫, స్వచక్రభయం ౭, పరచక్రభయం, ౧౭, ఈతి ౭, తృష్ణా ౧౧, నిద్రా ౧౩, ఆలస్యం ౫, ఉద్యోగం ౮, శాంతిః ౧౧, క్రోధః ౩, డంబం ౩, మిత్రభేదః ౧౫, మైత్రీ ౫. రసనిష్పత్తిః ౮, ఫలనిష్పత్తిః ౧౧ ఉత్సాహః ౭, ప్రాణిసౌఖ్యం ౧.

---

## నవనాయకఫలాని

### రాజా గురుః — ఫలం

శ్లో॥ ద్విజాతయః కర్మరతా స్స్వధర్మాస్సన్మార్గగానీతి విదో నరేంద్రాః ।
సుభిక్షమారోగ్య సుఖం ప్రజానాం సువృష్టిరబ్దాధిపతౌ సురేజ్యే ॥

ఈ రుధిరోద్గారినామ సంవత్సరమునందు రాజా గురుడైనందువల్ల బ్రాహ్మణులు వారి వారి కర్మలందాసక్తి కల్గియుంను, రాజులు సన్మార్గగాములును, నీతి వేత్తలును అగుదురు. ప్రజలు సువృష్టిచేత సుఖారోగ్యములు గల్గివుందురు.

### మంత్రీ గురుః — ఫలం

శ్లో॥ సువృష్టి స్సర్వసస్యార్ధ్య ఫలితా వృక్షజాతయః ।
సుభిక్షం క్షేమమారోగ్యం యది సుంత్రీ గురుర్భవేత్ ॥

ఈ సంవత్సరమునందు సువృష్టి ఫలితముచే సమస్త సస్యములు వృక్షజాతులు మంచి ఫలిత ములను ఇచ్చును. ప్రజలు సుఖములతోనూ, ఆరోగ్యముతోనూ ఉందురు. ప్రభువులకు యోగ్యమగు మంత్రులతో ఆలోచనయు నగును.

### రాజా మంత్రీ చ గురురేవఫలం

ఈ సంవత్సరము రాజా, మంత్రీ గురుడు అవుటవలన దేశమునందు చోరుల యొక్కయు, అగ్ని యొక్కయు, శస్త్రములయొక్కయు బాధలచేత క్షత్రియాదులు పీడింపబడుదురు.

### బుధస్య సేనాధిపతిత్వ ఫలం

శ్లో॥ వాతాహతా వారిధరాః కదాచిత్ వర్షంతి సస్యాని ఫలాన్వితాని ।
లోకాస్సదా పీడితకామచారై స్సైన్యాధిపత్యే బుధ చంద్రస్య ॥

సేనాధిపతి బుధుడు అయినందువలన మేఘములు వాయువుతోకూడి అప్పుడప్పుడు వర్షించు చుండును. పంటలు సంపూర్ణముగా పండును, ప్రజలు కామ ప్రకోపాదులతో నిండివుందురు.

### సస్యాధిపతిః రవిః — ఫలం

శ్లో॥ గోధూమ యవ ముఖ్యాని కుళుత్థ చణకాని చ ।
సమృద్ధాని భవిష్యంతి రవౌ సస్యాధినాయకే ॥

సస్యాధిపతి రవి అయినందువలన గోధుమ, యవ, ఉలవ, సెనగ మొ॥ ధాన్యములు పంటలు సంపూర్ణముగ పండగలవు।

### ధాన్యాధిపతిః శుక్రః — ఫలం

శ్లో॥ అతివృష్టి స్సుభిక్షం చ ఫలితా ధాన్యజాతయః ।
మానవానిరుజాస్సర్వే శుక్రే ధాన్యాధిపే సతి ॥

ధాన్యాధిపతి శుక్రుడు అయినందువలన అన్నిజాతుల ధాన్యములు ఫలించును. ఎక్కువ వర్ష ములు కురియును. సుభిక్షము కల్గును, ప్రజలందరు రోగాదిబాధలచే పీడింపబడుదురు.

బుధస్యార్ఘాధిపతేః — ఫలం

శ్లో॥ అర్ఘాధినాథే రజనీకరాత్మజే వృష్ట్యర్ఘనస్యాని బహూని చ స్యుః ।
కౌమారపాషండ జినేంద్రజాలికాః ప్రభూతహాస్యాః న తథాపరే జనాః ॥

బుధుడు అర్ఘాధిపతి ఆయినందువలన వర్షములు ఎక్కువ, పంటలు అధికముగా పండును.

మేఘాధిపతిః బుధః — ఫలం

శ్లో॥ గర్జితాశనిపాషాణ వాతాన్విత పయోధరాః ।
మధ్యదేశే మహావర్షం బుధే మేఘాధిపే సతి ॥

మేఘాధిపతి బుధుడు ఆయినందువలన పిడుగులు, ఉరుములు, వడగండ్లు గాలి మొదలగు వానిచేత వర్షించును. మధ్యభాగమునందు వర్షమధికమని తోచుచున్నది.

రసాధిపతిః కుజః - ఫలం

శ్లో॥ రజితం లవణం సర్పి తిల తైలగుడాదయః ।
శూన్యార్ఘం యాంతతే సర్వే భౌమే యది రసాధిపే ॥

వెండి, ఉప్పు, నెయ్యి, నువ్వులు, నూనె, బెల్లము మొదలగు సరకులకు ధరలు మందముగ నుండును.

నీరసాధిపతేశ్శనేః - ఫలం

శ్లో॥ శృంగాశ్మవలలం దారు లోహపాత్రాణి యాని చ ।
అనర్ఘం యాంతి సర్వత్ర శనౌ నీరసనాయకే ॥

ఇందువలన దువ్వెనలు, రాయి, మాంసము, శస్త్రపాత్రలు మొదలగువానికి ధరలు మందముగా సమముగా నుండును.

పురోహిత్యాద్యధిపతి ఫలం

శ్లో॥ క్రూరగ్రహం ఫలం క్రూరం శుభగ్రఫలం శుభమ్ ।
పురోహితాది సర్వేషాం భవేదీశ సముద్భవమ్ ॥

వీరలు క్రూరగ్రహములయినచో చెడుఫలితమును శుభగ్రహములయినచో శుభఫలితముల నొసంగెదరని భావము.

రవిచార ఫలాని

చైత్ర శు ౧ గురువాసరే రవేర్మేష ప్రవేశః ఘ ౬-౩ లు ।
వారఫలం :— గురువాసరేర్ఘవృద్ధిస్స్యాత్ ।
కాలఫలం :— పూర్వాహ్ణకాలే అగ్నిభయం ప్రకుర్యాత్ ।
ఆర్ద్రా ప్రవేశకాలతిథ్యాది ఫలాని-జ్యేష్ఠ శు౧౩ బుధవాసరే రవేరార్ద్రాప్రవేశః ఘ. ౩౦-౨౩ ।
తిథిఫలం :— త్రయోదశ్యాం జలప్లవః ।
వారఫలం :— బుధవాసరే సుఖకరః ।
నక్షత్రఫలం :— మైత్రేన్ద్రాణాం శుభం ప్రోక్తం ।
యోగఫలం:— సాధ్యే పూర్ణఫలప్రదః ।
కరణఫలః :— కౌలవే వృష్టిశ్శుభ్రదా ।
లగ్నఫలం :— ధనుర్లగ్నే సుభిక్షం స్యాత్ ।
కాలఫలం :— అస్తంగతార్ద్రా బహుసస్యసంపత్ ।

## షణ్మండల ఫలం

భరణ్యాది చతుర్థమండల ఫలం :— మహార్ఘరః ఇతి ః

శ్లో॥ ఆర్ద్రాప్రవేశే సూర్యస్య చంద్రస్స్యాద్భరణ్యాది చత్రయే ।
చతుర్థే మండలే తిష్ఠన్ సుభిక్షారోగ్యదాయకః ॥

## చంద్రచారఫలం

### జ్యేష్ఠ శుద్ధ ప్రతిపద్యుక్త వారఫలం.

శ్లో॥ దుర్భిక్షయుద్ధామయభీతయశ్చ నృపాన్పదాక్రోధముఖాః ప్రమత్తాః ।
సస్యాని మధ్యాని భవంతి లోకే జ్యేష్ఠా యది యుక్తే యది భానువాసరే ॥

తా॥ ఈ సంవత్సరము చంద్రచార ఫలము వలన దేశమునందు దుర్భిక్షములు, యుద్ధభయములు కల్గును. రాజులు విశేషమైన కోపస్వభావములను కల్గి వుందురు. పంటలు మధ్యమముగా ఫలించును.

### ఆషాఢ శుక్ల పంచమీయుత వారఫలం

శ్లో॥ ఆషాఢసిత పంచమ్యాం భృగువారో యదా భవేత్ ।
సుభిక్షం క్షేమమారోగ్యం సువృష్టిశ్చ భవేద్ధ్రువమ్ ॥

తా॥ ఆషాఢ శుక్ల పంచమీ శుక్రవారమయినందువలన ప్రజలు సుభిక్షములతోను, క్షేమకరముగను, ఆరోగ్యప్రదముగను వుందురని తాత్పర్యము,

### ఆషాఢకృష్ణపక్షస్థ రోహిణీయుత వారఫలం

శ్లో॥ ఆషాఢే కృష్ణపక్షే తు దశమీ రోహిణీయుతా ।
సర్వసస్య సమృద్ధిస్స్యాత్సువృష్టిర్జాయతే తదా ॥

తా॥ ఆషాఢ కృష్ణపక్ష దశమియందు రోహిణీ నక్షత్రమవుటచే సువృష్టివలన సర్వసస్యములు సమృద్ధిగ ఫలించునని భావము.

### ఆషాఢశుక్ల స్వాతీయుత తిథిఫలం.

శ్లో॥ ఆషాఢే శుక్లపక్షే తు నవమీ స్వాతిసంయుతా ।
వాయుస్సర్వత్ర సంవాతి భూమౌ బీజం న వాపయేత్ ॥

తా॥ ఆషాఢశుక్లపక్ష నవమియందు స్వాతి నక్షత్రమగుటచే వాయువులు అధికమగుటచే విత్తనములు మొత్తము అన్నియు మొలవవు అనిభావము.

## కుజచారఫలం

గత సంవత్సరే ఫాల్గుణ బ ౧౪ ఆదివాసరే మేషరాశౌ స్థితస్సన్ పూర్వఫల్గునీ నక్షత్రే అస్తమితః కుజః।

శ్లో॥ మంగళాస్త మనామ్మేషే పాషాణానాం మహర్ఘతామ్ ।

తా॥ కుజుడు మేషమందు అస్తమించుటవలన రాళ్ళకు వెలలధికమగును.

## నక్షత్రసంచారఫలమ్

వత్సరాది ప్రభృతి వైశాఖ శు ౧౦ స్థిరవారపర్యంతం అశ్విన్యాదిత్రయే కుజసంచారః ।

## కుజోదయఫలం

ఆషాఢ బ ౮ మం॥ రే పునర్వసూ నక్షత్రే మిథునరాశౌ ఉదితః కుజః.

శ్లో॥ యుగ్మేన్నదుః ష్టాప్యతా ।

తా॥ కుజుడు మిథునరాశియందు ఉదయించుటవలన దేశమునందు ఆహార పదార్థములకు లోపము, ధరలు హెచ్చుట ఆ సమయమునందు కల్గును

## గురుచారఫలం

వత్సరాది ప్రభృతి మార్గశీర్ష బ ౨ బుధవార పర్యంతం తులారాశౌ గురుస్థితిః

శ్లో॥ తులాన్వితే దేవగురౌ సువృష్టిస్సంపూర్ణసస్యాని ఫలంతి భూమౌ ।
యానీఒహవస్తూని తులోద్భవాని స్యుస్తాని సర్వాణి సుదుర్లభాని ॥

తా॥ బాగుగా వర్షములు కురియును, పంటలు సమృద్ధిగా ఫలించును, తూకపు వస్తువులకు ధరలధికమగును.

మార్గశీర్ష బ ౨ బుధవార ప్రభృతి ఆ వత్సరం వృశ్చికరాశౌ గురుస్థితః,

శ్లో॥ సురార్చితే వృశ్చికరాశిసంస్థే ధరాథవేశ్సన్య సువృష్టిపూర్ణా ।
సర్వేపి వర్ణాస్సుఖినో భవంతి నాశంగతాస్సంకరజాత యస్స్యుః ॥

తా॥ వర్షములు బాగుగా వర్షించును. పంటలు సమృద్ధిగ ఫలించును. జనులందరు సుఖింతురు. సంకరజాతి ప్రజలు నశింతురు.

## శుక్రచారఫలం

శ్రావణ శుద్ధ ౧౨ శని॥ (20-8-83) మఘా నక్షత్రే సింహరాశౌ శుక్రాస్తమయః.

రాశిఫలం :- శ్లో॥ సింహే పీడా భూపవర్గే తదానావృష్టిజం భయం ।

తా॥ రాజులకు భయము. ప్రజలకు అనావృష్టి భయము.

రాక్షసగణనక్షత్రం :- శ్లో॥ శుక్రాస్తే రాక్షసగణే హిందూదేశేషు విగ్రహః ।
అర్బురే రాజయుద్ధాని మిశ్రదేశేష్వ విగ్రహః ॥

తా॥ శుక్రాస్తమయము రాక్షసగణ నక్షత్రమందవుటవలన హిందూదేశమందు రాజకీయము లధికమయి విరోధము లధికమగును.

శ్రావణ బ ౬ మంగళవాసరే (30-8-83) మఘానక్షత్ర సింహరాశౌ తత్రైవస్థితస్సన్ ఉదిత శ్శుక్రః। శుక్రుడు పై తేదీన సింహరాశియందు ఉదయించుటవలన ఆప్రాంతములందు చోరభయములు, అతివృష్టి, ధాన్యనాశనము మొదలగునవి కల్గును. రాక్షసగణ నక్షత్రమవుటవలన పంచవర్ణముల రంగులు శిల్కులకు ఖరీదులు దుర్లభము. శ్రీఫలము లభించుట దుర్లభము. పురుషనాశనము లెక్కువ గల్గును

## శనిచారఫలం

అస్మిన్నబ్దే సదా తులారాశౌ చిత్రాస్వాతీవిశాఖాసు శని సంచారః.

రాశిఫలం :- మహార్ఘం ధాన్యానాం గరగరళ ధారాభిరఖిలామహీ।
పూర్ణా నిత్యం జగతి జనపీడాపి సతతమ్॥

గ్రం॥ సర్వే తేయాంతి నాశం వరపుర నగరాణ్యం బుధోఽప్యల్పమేవ।
చక్రవర్తో జనానాం సుఖధనరహితః సూర్యపుత్రే తులాయామ్॥

తా॥ ఈ సంవత్సరము శని తులారాశియందు సంచరించుటచే సకలజనులు సుఖము, సర్వధాన్య సమృద్ధియును అతి వెలలు కల్గియుండుట, భూమి కంపింపబడుట, దేశం అల్లకల్లోలములు కల్గి ఉండుటచే దేశపీడ కల్గివుండుట, ప్రజలు ఈతిభాధలు నొందుదురని భావము.

శనిసంచారఫలము :- సంవత్సరాదినుండి ఆగష్టు 27 వరకూ చిత్రానందుండుటచే ఈ సమయ మున శనిసంబంధమైనవానికి ధరలు అధికము. వ్యాపారస్తులకు 4 రెట్లు లాభమువచ్చును. ఆగష్టు 27 నుండి సంవత్సరాంతము వరకూ స్వాతీవిశాఖలందు సంచరించుటచే రాజులు స్వస్థాన భ్రష్టులగుదురని భావము.

## వర్షాధకస్థితి

వత్సరాది ప్రభృతి భాద్రపద బ ౫ శుక్రవార పర్యంతం బాలగోపాల హస్తే - అనావృష్టిః। వర్ష ఫలం - సామాన్య వర్షములు గల్గును. భాద్రపద బ ౫ శుక్ర॥ ప్ర॥ మార్గశిర బ॥ ౯ బుధ ప్ర॥ యౌవన వయస్క గోపాలహస్తే - సువృష్టిః। మార్గశిర బ ౯ బుధ॥ ప్ర॥ ఆవత్సరం వృద్ధగోపాలహస్తే స్థితిః - సుభిక్షఫలాని।

## కూర్మచక్రస్థిత శనిసంచారఫలమ్

ఈ సంవత్సరమున శని సంచారము చిత్రా, స్వాతి, విశాఖలందు గల్గుటచే దర్దుర, మహేంద్ర, వనవాస, సింహళ, భీమరథే, లంకా, త్రికూట, మలయా, శ్రీపర్వత, కిష్కింధ, మున్నగు దక్షిణదేశ

మందుగల ఆయా పట్టణ ప్రాంతములందు విశేష అరిష్టములు గల్గును. సంవత్సరాంతమునందు వాహిక, సౌరాష్ట్ర, మాళవ, ప్రకాశ, కొంకణ, మున్నగు నైఋతి దిశనుగల పట్టణ ప్రాంతములందు విశేష అరిష్ట ములు గల్గును.

## సంవత్సరఫలమ్

ఈ సంవత్సరమునందు మెరక పంటలు విస్తారముగ ఫలించును. సర్వసస్యఫలమిచ్చుదగు 16 వీసములలో 8 వీసములు మాత్రమే ఫలించును.

## మకర సంక్రమణ పురుష లక్షణము

అస్మిన్సంవత్సరే పుష్య శుద్ధ ఏకాదశీ స్థిరవాసరే తేది (14–1–1984) రవేః మకరరాశి ప్రవేశః ఘ ౪౩–౪౦ వి. ఘ.

శ్లో॥ అష్టకర్ణో విశాలాక్షో లంబభ్రూ ర్దీర్ఘనాసికః।
అష్టబాహుశ్చతుర్వక్త్రః సంక్రాంతి పురుషస్స్మృతః॥
శతయోజన మౌన్నత్యం విస్తీర్ణం ద్వాదశస్మృతమ్।
ఏవం రూపం హి విజ్ఞేయం సంక్రాంతి పురుషస్య తు॥

అస్య పురుషస్య రాక్షస నామధేయం - ఛండాలారిష్టం। నిర్మలోదకస్నానం - శుభం భవతి। ముద్గాక్షతాధారణం - పెసలు వశించును, చర్మవస్త్రం – భూతబాధ। సింధూర గంధః – యుద్ధం భవతి। మాధవీపుష్పం - యశోహానిః। పుష్యరాగాభరణం - అశుభాని। కాంస్యపాత్రే - కాంస్యాది నాశనమ్। చిత్రాన్న భోజనమ్ - క్షుద్భయం భవతి। బిల్వ ఫలభక్షణం - అతివృష్టిః। అశ్వవాహనం - అశ్వవతి నాశనమ్। కుంతాయుధము - కించిత్‌యుద్ధం। మయూర పింఛఛత్రం – లేఖకారిష్టం। పన్నగ ధారణమ్ – శిశూనా మరిష్టం। ఈశాన్య దిగ్యానం - తద్దేశారిష్టం। చింతా చేష్టా - సుఖం। విపిష్టో భవతి - సస్యవృద్ధిర్భవతి।



## పక్షఫలం

శ్లో॥ శుక్లపక్షే యథా పౌషే మకరస్థో దివాకరః।
ప్రజానాం వ్యాధిపీడాశ్చ నృపాణాం సమరం భవేత్॥

మకర సంక్రమణ తిథ్యాధి ఫలముచే ప్రజలకు రోగబాధలు, ప్రభువులకు యుద్ధభయములు, బ్రాహ్మణులకు పీడలు, అప్పుడప్పుడు అనావృష్టి సూచనలు గల్గును. అని తెలియుచున్నది.

## ఫలశ్రుతిః

శ్లో॥ సంక్రాంతి పురుషోత్పత్తి కాలే దానం స్వశక్తితః ।
ఫలం కాంస్యాది దాన్యాదీయతే దోషనాశనమ్ ॥

ఫలాని మూలాన్యజినం సువర్ణం గ్రామం శుకాద్యం సతిలేఖ గావః ।
ధాన్యం ఖరాంశోర్మకరప్రవేశేశ్వేతాని దానాని విశేషదాని ॥

మకరస్థే తీక్ష్ణభానౌ ధాన్యదానం కరోతి యః ।
తేజస్వీ రూపవాన్మర్త్యః సార్వభౌమః ప్రజాయతే ॥

యశ్శృణోతి మధు శుక్లపక్షకే వర్షనాథ పచివాధికం ఫలమ్ ।
ప్రాప్నుయాద్దురితముక్త విగ్రహశ్చాయురర్థమతులం యశస్సుఖమ్ ॥

కాలాన్యవరాగాదీన్యుక్త్వా పుణ్యాని కారయేద్యస్తు ।
తేషామంశం దశమం నియమేనాప్నోతి దైవజ్ఞః ॥

ఆయుర్వృద్ధిం పుత్రపౌత్రాభివృద్ధిం నిత్యారోగ్యం మంగళం నిర్వ్యపాయమ్ ।
అచ్ఛిన్నానాముత్సవానామవాప్తిం యచ్ఛంత్వేతే వత్సరాధీశ ముఖ్యాః ॥

తా॥ మకరసంక్రమణ ప్రవేశపుణ్యకాలమందు యథాశక్తి కాంస్య, ధాన్య, అజిన, సువర్ణ, ఆజ్య, వస్త్రదానములను చేయుటచే విశేషఫలము నొంది, ఆయురారోగ్య ఐశ్వర్య పుత్ర పౌత్రాభివృద్ధిని పొంది శుభఫలముల నొందగలరు.

## ఆదాయ వ్యయములు

| | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| మేషవృశ్చికయోః | ఆ. | ౧౧ | వ్య. | ౫ | ధనుర్మీనయోః | ఆ. | ౧౪ | వ్య. | ౧౧ |
| వృషభతులయోః | ,, | ౫ | ,, | ౧౪ | మకరకుంభయోః | ,, | ౨ | ,, | ౮ |
| మిథునకన్యయోః | ,, | ౮ | ,, | ౧౧ | సర్వాదాయః | | ౪౭ | ,, | ౬౫ |
| కటకస్య | ,, | ౨ | ,, | ౧౧ | అధికవ్యయః | | ౧౮ | | |
| సింహస్య | ,, | ౫ | ,, | ౫ | | | | | |

## రాజపూజ్యావమానాని

| | | | | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| మేషస్య | రా. | ౨ | అ. | ౪ | సింహస్య | రా. | ౭ | అ. | ౭ | ధనుషః | రా. | ౧ | అ. | ౨ |
| వృషభస్య | ,, | ౫ | ,, | ౪ | కన్యాయాః | ,, | ౩ | ,, | ౩ | మకరస్య | ,, | ౧ | ,, | ౨ |
| మిథునస్య | ,, | ౧ | ,, | ౭ | తులాయాః | ,, | ౬ | ,, | ౩ | కుంభస్య | ,, | ౪ | ,, | ౨ |
| కటకస్య | ,, | ౪ | ,, | ౭ | వృశ్చికస్య | ,, | ౨ | ,, | ౬ | మీనస్య | ,, | ౭ | ,, | ౨ |

## కందాయ ఫలములు

| అశ్వి | భర | కృత్తి | రోహి | మృగ | ఆర్ద్ర | పున | పుష్య | ఆశ్రే |
|---|---|---|---|---|---|---|---|---|
| ౬ | ౧ | ౪ | ౭ | ౨ | ౫ | ౦ | ౩ | ౬ |
| ౧ | ౨ | ౦ | ౧ | ౨ | ౦ | ౧ | ౨ | ౦ |
| ౦ | ౨ | ౪ | ౧ | ౩ | ౦ | ౨ | ౪ | ౧ |
| **మఖ** | **పుబ్బ** | **ఉత్త** | **హస్త** | **చిత్ర** | **స్వాతి** | **విశా** | **అనూ** | **జ్యేష్ఠ** |
| ౧ | ౪ | ౭ | ౨ | ౫ | ౦ | ౩ | ౬ | ౧ |
| ౧ | ౨ | ౦ | ౧ | ౨ | ౦ | ౧ | ౨ | ౦ |
| ౩ | ౦ | ౨ | ౪ | ౧ | ౩ | ౦ | ౨ | ౪ |
| **మూల** | **పూ-షా** | **ఉ-షా** | **శ్రవణం** | **ధనిష్ఠ** | **శత** | **పూ-భా** | **ఉ-భా** | **రేవతి** |
| ౪ | ౭ | ౨ | ౫ | ౦ | ౩ | ౬ | ౧ | ౪ |
| ౧ | ౨ | ౦ | ౧ | ౨ | ౦ | ౧ | ౨ | ౦ |
| ౧ | ౩ | ౦ | ౨ | ౪ | ౧ | ౩ | ౦ | ౨ |

శ్లో॥ విషమేష్వర్థలాభస్స్యాత్సమేషు సమతా భవేత్ । శూన్యేషు శూన్యమాప్నోతి కందాయఫలమీదృశమ్ ॥
ఆదిశూన్యే భవేద్వ్యాధి ర్మధ్యశూన్యే మహద్భయమ్ । అంత్యశూన్యే భవేద్ధాని త్రిషుశూన్యేషు నిష్ఫలమ్
ఏకైకస్య చతుర్మాసం కందాయానాం ఫలం క్రమాత్ ॥

తా॥ బేసిసంఖ్య ధనలాభమును, సమసంఖ్య సమఫలమును, సున్న శూన్యమును సూచించును మొదటిసున్న వ్యాధిని గుర్తించును. మధ్యమున్న ఎక్కువభయమును, చివరసున్న మొత్తము శూన్యమును. సూచించును. పైకందాయములు ఒక్కొక్కటి 4 గేసి మాసము లుండునని గ్రహించవలెను.

## సంవత్సర ఫలమ్

| | | |
|---|---|---|
| అశ్వి, పుష్య, స్వాతి, అభిజిత్ వారికి | — | రాజపూజ్యత |
| భరణి, ఆశ్రే, విశాఖ, శ్రవణం వారికి | — | యుద్ధభయం |
| కృత్తిక, మఖ, అనూరాధ, ధనిష్ఠ వారికి | — | అలంకారప్రాప్తి |
| రోహిణి, పూర్వఫల్గుని, జ్యేష్ఠ, శతభిషం వారికి | — | రోగభయం |
| మృగ, ఉ-ఫ, మూల, పూ-భా వారికి | — | ఆయుర్వృద్ధి |
| ఆర్ద్ర, హస్త, పూ-షా, ఉ-భా వారికి | — | అర్థలాభము |
| పున, చిత్ర, ఉ-షా, రేవతి వారికి | — | మనస్తాపము |

# 1. వర్ష యోగములు

**చైత్రమాసము** :— ఈ మాసమున ఈ గ్రహములన్నిటికినీ వాయు మహావాయు, దహన, నాడీసంచారము కలదు. బ ౮ షష్ఠివరకూ పురశ్శుక్రుడు, బ ౧౦ దశమి లగాయతూ పురోంగారకుడు అనావృష్టి ప్రదులు. శుక్లపక్షమున మేఘాడంబరములు, గాలిదుమారములు ఉండును. అమావాస్యా ప్రాంతమున ఎండలు మెండుగా కాయును. చాంద్రయోగములచే ఏప్రిల్ 19,20,26,27, మే 2,3,7,9,10 తేదీలలో అకస్మిక వర్షసూచనలు కల్గును.

**వైశాఖమాసము** :— ఈ మాసములో రవి కుజ గురులకు శుక్రునికి వాయునాడీ సంచారమున్నూ, బుధునకు మహావాయునాడీ, శుద్ధ నవమీ వరకూ పురోంగారకుడు, శుద్ధ తదియనుండి బహుళ పంచమి పర్యంతం పురశ్శుక్ర రవి మధ్యముకలదు. ఈ మాసమంతయు గాలిదుమారములు హెచ్చుగా నుండును. ఎండలు మెండుగా కాయును. చాంద్రయోగములచే మే 13,15,16,17,22,23,26,27, తేదీలు. జూన్ 1,2,7 తేదీలలో అకస్మిక వర్షములు కురియు సూచనలు కల్గును.

**జ్యేష్ఠమాసము** :— ఇందు గురు బుధులకు వాయు, మహావాయునాడుల యందును సంచారము కలదు. శుద్ధనవమి అంగారక చలనము, శు ౯ నుండి బహుళ పంచమి వరకూ పురశ్శుక్రుడు. బ ౬ లగాయతు ప్రాగ్దిశి మఘాది పంచక శుక్రుడు, శు ౯ లగాయతు పతంగ మార్గ కుజుడు మొద లగు వర్ష యోగములకున్నూ, బ ౬ వ పురశ్శుక్ర రవిమధ్యము. మొదలగు వర్ష ప్రతిబంధకములు కలవు. శుద్ధమున అనావృష్టియు, బహుళమున తొలకరివానలు ప్రారంభమగును. చాంద్ర యోగములచే జూన్ 12,13,17,19,20,21,25,26,27,29,30 తేదీలందు, జూలై 4,5 తేదీలలో వర్షములు కురియును.

**ఆషాఢమాసము** :— ఇందు గురు శనులకు మహావాయు, దహన నాడీయందును మిగిలిన గ్రహములకు రస, జల, అమృత సౌమ్యనాడీ సంచారము కలదు. శుద్ధ ౮ వరకూ పతంగ మార్గకుజుడు. పురశ్శుక్రుడు మొదలగు వర్షయోగములున్నూ, శు ౮ వరకు పురోబుధుడు, బ ౩ లు॥ పురో బుధుడు బ ౩ లు॥ పురోబుధుడు శు ౩ లు॥ కాలసర్పయోగముకలదు. శుద్ధమున అధికవర్షములు బహుళమున అనావృష్టియు కల్గును. చాంద్రయోగములచే జూలై 11,15,16,17,22,23,27,28 ఆగస్టు 3,7,8 తేదీలయందు వర్షములు కురియును.

**శ్రావణమాసము** :— ఇందు గురుశనులకు మహావాయునాడులందును మిగిలిన గ్రహములకు అమృత, జల, రస నాడులందును సంచారము కలదు. శు ౯ వ॥ పురోబుధుడు, శు ౧౧ లు॥ పురోబుధ, రవి మధ్యము. మాసము అంతయు కాలసర్పయోగము కలదు, శు ౯ వ. బుధ యోగముకలదు. మాసము అంతయూ శుక్రసమాగమము కలదు. దీని వలన మేఘాడంబరములు కలగును. శుద్ధమున ఖండవృష్టియు, బహుళమున స్వల్పవర్షములు కురియును. చాంద్రయోగములచే ఆగ 16,17,21,22,25,26,28,30 సెప్టెం 2,3,4, తేదీలలో వర్షములు కురియును.

**భాద్రపదమాసము** :— ఇందు గురుశనులకు మహా వాయునాడులందును, మిగిలిన గ్రహములకు రస, జల, అమృత సౌమ్య నాడీసంచారముకలదు. శు ౧౧ అంగారక చలనము శు ౧౧ వరకూ పురోం

గారక చలనము, శు ౧౩ ల. పురశ్శుక్ర రవి మధ్యము. ఈ మాసమంతయు సామాన్య వర్షములు కురియును. చాంద్రయోగములచే సెప్టెంబరు 10,11.12,17.18.19,22,23.25,26. 28,30. అక్టో 3,5, లలో వర్షములు కురియును,

**ఆశ్వయుజమాసము:—** ఇందు గురుశనులకు మహావాయునాడులందును, మిగిలిన గ్రహములకు అమృత, రస, జల, సౌమ్య నాడీ సంచారము కలదు. మాసమంతయు సింహాంగారకుడు. కాలసర్ప యోగము. బ ౯ ల॥ పురోబుధుడు శు ౧౨ వ॥ పురశ్శని కలదు. శుద్ధమున ఖండవృష్టి బహుళమున మేఘప్రాబల్యములు ఉండును. చాంద్రయోగములచే అక్టో 8,9,12,13,16,17,18, 19,22,23,27,28 తేదీలలో వర్ష సూచనలున్నవి.

**కార్తీకమాసము:—** ఈ మాసమున కుజ, శుక్రులకు సౌమ్య, రస, జలనాడులందును, మిగిలిన గ్రహములకు మహావాయు, దహననాడీ సంచారము కలదు. శు ౩ అంగారక చలనము, బ ౧౨ గుర్వస్తమయము, శు ౩ వ॥ సింహాంగారకుడు బ ౧౦ వ॥ కాలసర్పయోగము. బ ౧౦ ల॥ పురో బుధ రవి మధ్యము కలదు, గాలితోకూడిన వర్షములు నవం 5 నుండి 9.14.17,21,22,29,30 డిశం. 3,4 తేదీలయందు కురియును.

**మార్గశిరమాసము:—** ఈ నెలలో కుజ శుక్రులకు సౌమ్య రస నాడులందును, మిగిలిన గ్రహములకు దహన వాయునాడీ సంచారము కలదు. శు ౨ ల గాయకు పశ్చిమదిశ శ్యావత్రయ శుక్రుడు, బ ౧౦ వ॥ అంగారక చలనము మొదలగు వర్షయోగములున్నా, శు ౧౧ వ॥ పురోబుధ రవి మధ్యము కలదు. శుద్ధమున అనావృష్టి, బహుళమున ఖండవృష్టికల్గును. చాంద్రయోగములచే డిశం. 9,10,14,15,16,19,20,22,29,28,29 తేదీలలో ఖండవృష్టితో కూడిన వర్షములు కురియును.

**పుష్యమాసము:—** ఇందు రవికి సౌమ్య రస జల అమృత నాడులందును, మిగిలిన వారికి వాయు, మహావాయు దహననాడీ సంచారము కలదు. శు ౧౧ ల॥ బుధ, గురు సమాగమము. బ ౨ ల॥ గురు శుక్ర సమాగమము ౬ వరకూ పశ్చిమదిశ స్వాతీత్రయ శుక్రుడు, శు ౧౧ వ॥ పురో బుధ రవి రవిమధ్యము కలదు. ఈ మాస శుక్ల పక్షమున అనావృష్టి. బహుళమున ఖండవృష్టి కల్గును. చాంద్రయోగములచే జన 6,7,12,13,16,17,23 నుండి 26 తేదీలలో ఆకస్మిక వర్షసూచనలు కలుగును.

**మాఘమాసము:—** ఇందు రవి బుధ గురులకు అమృత రస జల నాడులందును మిగిలిన గ్రహములకు మహావాయు, వాయు, దహననాడులందును సంచారము కలదు. బ ౮ వరకు బుధ శుక్ర సమాగమము. శు ౧౧ ల॥ బ ౮ వరకు పురోరవి కలవు. పూర్ణిమా ప్రాంతమున ఖండవృష్టి కలుగును. చాంద్రయోగములచే ఫిబ్రవరి 3,4,12,13,15,19,20,29 తేదీలలో అకస్మిక వర్షసూచనలు కలుగును.

**ఫాల్గుణమాసము:—** ఈ మాసమందు కుజ శనులకు మహావాయు నాడీయందును, మిగిలిన గ్రహములకు రస, జల, సౌమ్య నాడీ సంచారమునూ, శు ౪ అంగారకచలనము. శు ౬ ల॥ శు ౮ వ॥ బుధ శుక్ర సమాగమము. శుద్ధమున మేఘాడంబరము కలసి స్వల్పవృష్టి కలుగును. చాంద్రయోగములచే మార్చి 6,7,11,12,18,19,22,23 తేదీలలో అకస్మిక వర్షసూచనలు కలుగును.

---

## 2. ధరలు

చైత్రమాసము :– శుద్ధపాడ్యమి లగాయతు పౌర్ణిమవరకు ఫలాదులు, చెఱకు, తిల తైలాదులు, విదుత్యే వస్తువులు, మిర్చి, కరక్క, జాజీ, ఇంగువ, తృణజాతులు, పశువులు, నూలు, వక్కలునూ ధరలు నిలబాటుగను, గుజ్జములు, పిండిధాన్యములు (ఉత్తరదేశమందును) పొట్టుధాన్యములు టెంకాయ ఏలకులు (దక్షిణప్రాంతమందును, ధరలు తగ్గును. ఎఱ్ఱని పుష్పములు. అన్ని పదార్థములు, బెల్లము, రాయి, దంతములు, గృహములు, గొఱ్ఱెలు, కాగితములు, రసద్రవ్యములు, గోధుమ, యవలు, రత్నములు అమావాస్యలోపున ధరలు పెరుగును. శుద్ధచవితి లగాయతు ధాన్యము, వేరుశనగలు తిలజాతులు, కస్తూరి. ఉప్పు, మత్తుపదార్థములు ధర హెచ్చుతగ్గులుగా నడచును. బహుళ ద్వాదశి వరకు పశువులు, పండ్లు, జొన్నలు. పంటలు తక్కువై ధరలు హెచ్చును.

వైశాఖమాసము :– శుద్ధత్రయోదశి వరకు బంగారము, వెండి, పగడము, ముత్యము, రాగి, తెల్లవస్త్రములు, గోధుమ, నెయ్యి, నూనె, ఉప్పు, పంచదార ధరలు సమము. ధాన్యము, పసుపు, ప్రత్తి, పెసలు, పప్పుదినుసులు క్రమముగా చురుకు. పిమ్మట నిలబాటు. వెండి, పట్టు, జాజి, పేపరు లవంగాలు, మిరియాలు దుంపజాతులు. పశువుల ధర హెచ్చును, బహుళ చవితి లగాయతు నూనె, దూది, నిత్యావసర వస్తువులు. ఫ్యాన్సీ మొదలగునవి, రసద్రవ్యములు, పొట్టుధాన్యములు, తగ్గుమీద హెచ్చును. నీరుల్లి, వెల్లుల్లి మిర్చి, పూలు, బెల్లము, చింతపండు, కొబ్బరి శుక్ల పక్షముకంటె బహుళపక్షమువరకు ధరలు పెరుగును.

వ్యాపారస్థులకు క్రమముగా బహుళపక్షము చాలా అనుకూలముగా నుండును.

జ్యేష్ఠమాసము:– శుద్ధ అష్టమిలగాయతూ గోధుమ, నువ్వులు, నూలు, వస్త్రములకు, పొక. వెండి, బంగారము ధరలు పెరుగును. బహుళమున బంగారము నిలబాటు. వెండి కొద్ది చురుకు గల్గి తరువాత అమావాస్య ప్రాంతమున మందము. బహుళ పంచమి లగాయతూ గోధుమ, మినుములు. నువ్వులు, పేపరు, బెల్లము మొదలగువాని ధరలు నిలబాటు. బంగారము వెండి, లోహజాతులు, పిప్పళ్ళు, అడవిజాతులు నెయ్యి, వరిజాతులు, మినుములు, పెసలు, కందులు శుక్లములో చురుకు, చింతపండు, నూనె, వస్త్రములు నెమ్మదిమీద ధరహెచ్చును. కొబ్బరి, పసుపు, నీరుల్లి, వెల్లుల్లి, ధాన్యము, పట్టువస్త్రములు శుక్లములో కన్న బహుళములో మందము. బంగారము, వెండి, నెయ్యి వరి మాత్రము హెచ్చుధరపై నిలబడును మిగిలినవి ధరలు సమము.

ఆషాఢమాసము:– శుద్ధ ఏకాదశి వరకు కాగితము, నూలు. దూది, ధర మందము. వస్త్రములు. పొక, ఖర్జూర, వనమూలిక, ఔషధవస్తువులకు, రసద్రవ్యములకు ధర హెచ్చుమీద నిలచును, బహుళ నవమి లగాయతు ధాన్యాదులు ధర హెచ్చును. బంగారము, నెయ్యి, మత్తు పదార్థములు పొగాకు, రసద్రవ్యాదులు పచ్చినరకు హెచ్చుధర కల్గివుండును, వెండి శుక్ల పక్షములో చురుకుగను బహుళపక్షములో మొదటి వారము మందము. అమావాస్య ప్రాంతములో ప్రత్తి, నూలు, కాగితము, తినుబండారములు, వాహనములు, లేళ్ళు, ఏనుగులు, పశువులు 3 వారములవరకు చురుకు. చివరివారము మందము. ధాన్యజాతులు నిలబాటు. ఉల్లి, పసుపు, లోహజాతులు, మిర్చి చురుకు. కొబ్బరి, మది, పప్పుదినుసులు, ఇనుము, బహుళములో హెచ్చుమీద నిలబాటు.

శ్రావణమాసము :— ఈ మాసములో వెండి, బంగారములకు బహుళ పక్షమున ధరలు చురుకుగ వుండును. ధాన్యము ప్రత్తి, బెల్లము, చింతపండు, నువ్వులు, నూనెజాతులు కాగితము, యంత్రములు చురుకుగా వుండును. పసుపు, ఉల్లి, దుంపజాతులు, శుద్ధఅష్టమి మొదలు స్వల్పముగ చురుకు, కొబ్బరి, పొట్టుధాన్యములు. మిర్చి, 4 వ వారములో మందము. రాగి లోహజాతులు 1, 2, 3 వారములలో చురుకు శుద్ధ తదియ వరకు ధాన్యాదులు హెచ్చుధరలలో నడచును. శుద్ధ ద్వాదశి లగాయతు బహుళ అష్టమివరకు అపరాలు హెచ్చు. ధాన్యాదులకు, నూలు, పోక, నువ్వులు, బంగారము, ధర మందము. గోధుమ, వెండి, నెయ్యి, లోహజాతులు, పశువులు, రస ద్రవ్యములు, ఓషధులు, వన్యమృగములు, ధరలు హెచ్చుమీద నడచును. వ్యాపారస్థులకు ఈ మాసము మొత్తముమీద తెలివిగ మసలుకొనవలసి వుండును.

భాద్రపదమాసము :— బహుళ సప్తమి వరకు నువ్వులు, దూది, నూలు, పోక, లవంగ, మొదలగు సుగంధ ద్రవ్యములు వెల హెచ్చుగ నుండును. క్రమముగా మందము. ధాన్యాదులు ధరలు మందము. సప్తమి మొదలు అపరాదులకు ధరలు హెచ్చు. పశువులు, నెయ్యి, బంగారము, వెండి ధరలు హెచ్చు మీద నిలబాటు, ధాన్యములు, బియ్యము, పొట్టుధాన్యములు, కొబ్బరి, ఖర్జూర, రసాయనిక, జాజి, ఇంగువ, బెల్లము, నువ్వులు. కందమూలములు. ధరలు హెచ్చు. పేపరు. నూలువస్త్రములు, వ్యవసాయ పరికరములు బహుళ పక్షమున ధర పెరుగును. బహుళములో సరకులు విడుదలచేసుకొనుట లాభదాయకము. వెండి నిలబాటు బంగారము హెచ్చు తగ్గులుగా నడచును. మిర్చి, పప్పుసరుకులు ధరలు హెచ్చు.

ఆశ్వయుజమాసము :— పూర్ణిమ ప్రాంతము తెల్లధాన్యములు, తెల్లవస్తువులు ధరలు చురుకు. బహుళములో అన్నిరకముల ధాన్యములు ధరల అధికము. ప్రత్తి, లక్క, సుగంధములు, గుబ్బములు, కుక్కలు, ఒంటె మొదలగు వన్యజాతులు చురుకుధరలు కలిగివుండును. నువ్వులు, బెల్లము, చింతపండు, మధుర పదార్ధములు నెమ్మదిమీద చురుకు. ఉల్లి, పచ్చిసరకు, పశువులు, మూలపదార్థములు ధరలు మందము. బహుళములో కంచు, చురుకు, తక్కిన లోహజాతులు, పేపరు, కొబ్బరి, మిర్చి, మందము. శుద్ధ దశమి లగాయతు బహుళ అష్టమి వరకు ధాన్యాదులకు ధరలు మందము. బెల్లము, చెరకుధరలు నిలబాటు. కంబళ్ళు, పట్టు వస్త్రములు ధాతు పదార్థములు వెలహెచ్చు. మిగిలినవి సమము.

కార్తీకమాసము :— బహుళ దశమి వరకు పోకలు, ఖర్జూరములు, యాలకలు, నూలు, కాగితము, ఇనుము ధరలు పెరుగును. బహుళ అష్టమి లగాయతు చెఱకు, వరి, నెయ్యి, రసద్రవ్యములకు ధర హెచ్చుమీద నిలబాటు. గోధుమ, బంగారము. లోహజాతులు క్రమముగా వెలలధికము. ధాన్యము, కందులు, అపరాలు, నువ్వులు, శుక్లమున చురుకు. దూదివస్త్రములు 3వ వారము చురుకు. 4 వ వారము మందము. వెండి, బెల్లము, లోహజాతులు 3వ వారము వరకుమందము. తదుపరి క్రమముగ పెరుగును. క్రమముగ ధాన్యధరలు బహుళమున తగ్గును. మిర్చి, పసుపు, ఉల్లి, పచ్చిసరకులు, కొబ్బరి నిలబాటు, అమావాస్య ప్రాంతమున బొబ్బపెసర, కొబ్బరి, బియ్యము, గోధుమ, అనుములు, పశుజాతి, యంత్రపరికరములు కొద్ది చురుకు. విద్యార్థులకు లాభదాయకముగా నుండును.

మార్గశిరమాసము :— ఈ మాసములో దూది, పట్టువస్త్రములు, ధరలు చురుకు. వ్యాపారము మందము, చింతపండు, చక్కెర, నువ్వులు, కొబ్బరి క్రమమీద లాభదాయకము. పసుపు, నీరుల్లి. దుంపజాతులు నిలబాటు. లోహజాతులు ధరలు పెరుగును. బహుళములో లాభము కలసి వచ్చును. కంబళ్ళు, ఆవాలు, ఓషధులు, మినుము, గోధుమ, కోళ్ళు, క్రమముగా మందము. మిర్చి బహుళములో చురుకులో నిలబాటు. శుద్ధ దశమి లగాయతు బహుళ పంచమి వరకు ధాన్యము ధర పెరుగును. బెల్లము ధర నిలబాటు. పప్పుదినుసులు. నూనె, నెయ్యి, రసద్రవ్యములు హెచ్చుగ రవాణా సాగును. విల్వదారులు యోచించి మసలుకొనుట మంచిది.

పుష్యమాసము :— ఈ మాసములో బహుళ విదియనుండి పొట్టుధాన్యములు ధర హెచ్చును. ధాన్యము. బియ్యము, పప్పుదినుసులు శుక్లములో హెచ్చు, బహుళములో నిలబాటు. గోధుమ, చక్కెర, లవంగ, ఖర్జూరఫల, పుష్పజాతులు, వస్త్రములు, కంబళ్ళు, ముతకబట్టలు హెచ్చు మీద నిలబాటు. రసద్రవ్యములు చింతపండు, చక్కెర, మిర్చి, నూనెజాతులకు, రంగు కాగితములు. ఆవాలు మొదలగునవి 3 వారముల వరకు చురుకు. దూది, బంగారము, వెండి, పశువులు, ధరలుమందము. ఉప్పు, చక్కెర, చందనము, నువ్వులు శుక్లములో చురుకు. 4 వారము నిలబాటు పసుపు ఉల్లి దుంపలు, కొబ్బరి ధరలు మందము. లోహజాతులు కొద్ది చురుకు.

మాఘమాసము :— ఈ మాసమంతయునూ బంగారము, వెండి, తగరము వీటికి ధరలధికము. ధాన్యము ధర కొంచెము చురుకు. ప్రత్తి, వస్త్రములు బహుళములో మందము. చింతపండు, చక్కెర, బెల్లము, నెయ్యి, నూనె, శుద్ధముకన్న బహుళములో క్రమముగా ధరలుపెరుగును. ఉల్లి, ఫల, పుష్పములు, దుంపలు, శుక్లములో మందము. పప్పుజాతులు, ధరలుహెచ్చు తగ్గులుగానుండును. కొబ్బరి, యాలకలు, మినుములు, శనగలు, ఆవాలు, క్రమముగా ధరలు హెచ్చుమీద నడచును. మిర్చికి ఈ మాసమంతయు ధర అధికము. శుద్ధ అష్టమివరకు గోధుమ, పప్పుదినుసులు, ధర హెచ్చును. శుద్ధ చవితి లగాయతు ధాన్యము ధర పెరుగును. బహుళ దశమివరకు బెల్లము, అవిసె, శనగ, ధాన్యము రేట్లు హెచ్చు. చెరకు, బెల్లము, తదువరి నిలబాటు. బంగారము, లోహజాతులు, నెయ్యి, నూనె, వస్త్రముల హెచ్చుమీద నిలబాటు.

ఫాల్గుణమాసము :— ఈ మాసములో బహుళ సప్తమి లగాయతు ధాన్యాదులకు ధర హెచ్చు. దూది. నూలు, నూనె, కాగితముల ధరలు విపరీతము. బహుళదశమినుండి కుంకుమ, జాజి, లవంగ మొదలదు సుగంధ ద్రవ్యముల ధరలు అధికమగును. 2, 3 వారములలో ధాన్యములు, వస్త్రములు నిలబాటు. 4 వ వారము మందము. వెండి శుద్ధములో మందము, బెల్లము, శర్కర, మధుర పదార్థములు, ఉప్పు, మిర్చి, నూనెజాతులు, చింతపండు, ఉలవలు, 3 వ వారము వరకు నిలబాటు. 4 వ వారము చురుకు. రాగి, ఇత్తడి, ఇనుము, లోహజాతులు, 2, 3 వారములు చురుకు. ధాన్యం నిలబాటు. చివరివారములో హెచ్చును. మిర్చి, కొబ్బరి, సుగంధ ద్రవ్యములు. దుంపకూరలు, ఓషధులు బహుళములో క్రమముగ ధరలు పెరుగును. పప్పుజాతులన్ని 2, 3 వారములు చురుకు, పసుపు, ఉల్లి, పశువులజాతులు మాసమంతయు చురుకుగ నుండును.

# 3. శ్రీ రుధిరోద్గారినామ సంవత్సర గోచార ఫలములు

## మేషరాశి

(అశ్వి, భర, కృత్తి, 1 పా॥)

ఆదాయము: 11; వ్యయం: 5 రాజ పూ: 2; అవ: 4

ఈ రాశివారికి పుణ్యక్షేత్ర, తీర్థయాత్రాఫలము సిద్ధించును. అనారోగ్యము, కొంత వృధావ్యయము తట్టుకొనవలసి యుండును. డబ్బు ఆటంకమురాదు. ఏదో విధముగ అవసరములు గడచిపోవుచుండును గౌరవలాభము, మాటపలుకుబడికి మాటపట్టింపులు, పంతాలకు పోవుట మంచిదికాదు. ఈ సం॥లో 3 పంటలు ఫలితము కనబడును. స్థిరమైన భూ గృహలాభములు జూలై తదుపరి అనుకూలించును శుభకార్యములు అవ్యవధిగా చేయవలసివచ్చును. ప్రభుత్వ వృత్తికి అధికారలాభములు రీత్యా తట్టుకొన గల్గుదురు. సెప్టెంబరు 23 లగాయితు అనుకూల మార్పులు కలుగును. ఉద్యోగస్తులకు కోరిన బదిలీలు జరుగును. విద్యార్థులు స్వశక్తిమీద ఉత్తీర్ణులగుటకు కృషి చేయవలసియుండును. 2 వ ఛాన్సు మంచిది కాదు ఒక్కపాఠ్యాంశము గట్టిగా కృషిచేయవలసి యుండును.

యంత్ర, ఇనుము, బొగ్గు రసాయన, కలప, పేపరు, వైద్య వృత్తి వ్యాపారస్థులకు నష్టము మాత్రము రాదు. వ్యవసాయదారులకు మేలుకనబడును. 2 వ పంట సామాన్యముగ ఫలించును.

ఈ రాశివారలకు 5,6,8,9,15,24 తేదీలు, మంగళ గురు శుక్రవారములు కలసివచ్చిన యోగించును. 6,9,11,12 ఇంగ్లీషు నెలలందు విష్ణుపూజ నామజపము చేయించుటవలన ఆరోగ్యము, వ్యయము తట్టుకొన గల్గుదురు. కుక్షి, ఉదర, శ్లేష్మ సంబంధమగు అనారోగ్యసూచనలు కనబడును.

జాతిపగడము (ఉంగరములో) ధరించుటవలన మనోధైర్యము, ఋణవిముక్తి, మాటచలాయింపు, అధికారయోగము మొ॥ ఫలితములు ఇచ్చును. రాగి, కందులు, ఎఱ్ఱపువ్వులు, వస్త్రములు దానములిచ్చుట శుభప్రదము.

## వృషభరాశి

(కృత్తిక 2,3,4 పా॥ రోహిణి, మృగ 1,2 పా॥)

ఆదాయము: 5; వ్యయం: 14 రాజ పూ: 5; అవ: 4

ఈ రాశివారికి కొంత అనుకూలముగ నడచిన, అతి తెలివివలన నష్టపోవుట జరుగును, అధికార స్వాతిశయము కల్పించుకొందురు. గౌరవములకు లోటురానీయరు. లావాదేవీలందు 3 పంతులు అనుకూలము. శత్రులు మిత్రులు కాగలుగుదురు. సెప్టెంబరు మొదటివారము వరకు వ్యయము తట్టుకొనవలసియుండును. విలువగల వస్తువాహనములకు వ్యయము తప్పనిసరియగును. ప్రయాస చికాకులు తప్పవు. రాజకీయములందు దిగుట మంచిదికాదు. పౌరుషముకొఱకు పాటుపడెదరు. పరాజయము-సూచనలు కనిపించును. గౌరవము కాపాడుకొనగలుగుదురు.

సిపి, లలితకళా పరిశ్రమలు అనుకూల లాభములు కలిగించును. విద్యార్థులకు యోగకాలము శ్రమమీద ఫలితములు సాధించెదరు. విద్యుత్, యంత్ర, వైద్య, న్యాయ, సంబంధమైన వృత్తులవారి. యోగించుకాలము. ప్రీవరముగ వ్యయముకాక తప్పదు.

మంగళ, బుధ, శుక్రవారములు 6,15,24 తేదీలతో కలసివచ్చిన యోగప్రదము. కార్యానుకూలత 6,10,11 ఇంగ్లీషు నెలలందు జాగ్రత్త అవసరము. శివస్తోత్రములు, దేవీపూజలు జరిగించుకొనుట అవసరము. వ్యవసాయ ఉద్యోగ అన్నిరకముల వ్యాపారస్థులకు సామాన్య ఫలితము కనబడును.

జాతివజ్రము ధరించుటవలన నూతనతేజస్సు, కళ, ధాన్యసంపత్తులు, సంసార జీవిత సుఖములు సుఖప్రసవములు కలుగును. అంటువ్యాధులు, దీర్ఘవ్యాధులు నివారింపబడును. చిత్ర వస్త్రములు వెండి, గోవు, బొబ్బర్లు, నెయ్యి దానము యిచ్చుట మంచిది.

## మిథునరాశి

(మృగ 3,4, ఆర్ద్ర, పునర్వసు 1,2,3 పా॥)

ఆదాయం: 8; వ్యయం: 11 రాజ పూ: 1; అవ: 7

ఈ జాతకులకు వాహన, అధికారలాభములతో నిల్వవున్న సమస్యలు. క్రొత్తగా నున్నవి, (గృహ, భూ, కోర్టు) అనుకూల మార్పుతో సాధించగల్గుదురు. పెద్దల పరిచయముతో గౌరవాధిక్యతలు చేయుటజరుగును. కుటుంబకలతలు, వలతలు ఒకదారికి రాగలవు. రాజకీయ ప్రభుత్వపత్తిడి తట్టుకొనగల్గుదురు. నమ్మినవారిలో కలతలు రాగల సూచనలున్నవి. అందరిని అన్ని విషయములందును నమ్మదగిన కాలముకాదు. కించిత్తు చోర,అగ్ని భయ సూచనలున్నవి. వ్యాపారస్తులకు నవంబరువరకు అనుకూలము, తదుపరి ఆలోచించి నిల్వచేయుట మంచిది. వీరివలన ఇతరులకు మేలు. లాభము కనిపించును.

బొగ్గు, కలప, ఇనుము యంత్రవృత్తులవారికి మొదటి 8 మాసములు అనుకూలము. గణిత, ఇంజినీరింగు, భూగోళ, జ్యోతిష, వైద్య, ప్రచురణ, ధాన్యవృత్తులవారికి, కంట్రాక్టుదారులకు అనుకూల కాలము. అన్ని తెలిసి అన్నివిషయములందును తలదూర్చుట వలన కష్టనష్టములు తప్పవు. కళత్ర అనుకూలత తక్కువ. విద్యార్థులు రెండుభాషలలో అన్నిట ఉత్తీర్ణులగుదురు కాని తరగతులలో వాదోపవాదములు తగ్గించుకొనుట మంచిది.

5,14,23 తేదీలు బుధ, గురు, శుక్రవారములతో కలసివచ్చిన మంచిది. 6,9,12 ఇంగ్లీషు నెలలందు దేవీపూజ, స్తోత్రముచేయుట మంచిది.

జాతి అకుపచ్చ ధరించుటవలన వ్యాపారలాభము, గణితములో నేర్పు, జ్ఞాపకశక్తి, నరముల అనారోగ్యము నివారణయగుట, దృష్టిదోషములు తొలగుట మొ॥ ఫలితములు కనిపించును.

పెసలు, ఆవునెయ్యి, పచ్చ. కంచు, పచ్చనివస్త్రము దానము యిచ్చుట మంచిది.

## కర్కాటకరాశి

(పున 4, పుష్యమి, ఆశ్రేష)

ఆదాయం: 2; వ్యయం: 11 రాజ పూ: 4; అవ: 7

ఈ రాశివారు ఎంత తెలివిగా, సులువుగ పనులు చేయగల్గిన అధికారులు, ఉద్యోగస్థులు జాగ్రత్తగ మసలుకొనవలసి యుండును. బాధ్యతలు ఇతరులపై నుంచుట మంచిదికాదు. కళత్ర, సంతాన, అనారోగ్య ఋణ చికాకులందు ఓర్పు, నేర్పు అవసరము. ఇది ఒక పరీక్షకాలముగ వడచును. శ్రమ మీద లావాదేవీలు ఒకదానికి రాగలవు. ప్రారంభములో చికాకులు కలిగిన శ్రావణము (సెప్టెంబరు) నుండి కొంత అనుకూలత ఏర్పడి నవంబరు లగాయితు కొంత మేలు కనిపించును.

వ్యాపారస్థులకు 5 ట 3 వంతులు మేలు అనిపించును. మాటనేర్పు చాల ఉపకారి కాగలదు. విద్యార్థులు గతంలోకన్న ఇతర పాఠ్యాంశములందు శ్రద్ధతీసికొనవలసి యుండును. మనోనిగ్రహముతో శని, గురుల మార్పువలన కొన్ని చికాకులు తట్టుకొనగల్గుదురు. విచిత్రవస్తు, వస్త్ర, భూ, గృహ, శుభ కార్యలాభము కనిపించును, పశువృద్ధి అవకాశము లేదు.

వైద్య, ఉపాధ్యాయ, గ్రామాధిపత్య, ముద్రణ, జల వ్యాపారస్థులకు అనుకూలకాలము. సంవత్సరాంతములో ఇతరులవల్ల ఉపకారము, లాభము కనిపించును.

2,11,20,29 తేదీలు ఆది, సోమవారములతో కలసివచ్చిన యత్నకార్యసిద్ధి, అనుకూలత.

1,2,6 ఇంగ్లీషు నెలలందు చికాకులు, ధనవత్తిడి కలుగును. దేవస్తోత్రము, నాగేశ్వరపూజా స్తోత్రములు చేయుట మంచిది.

జాతిముత్యము ధరించుటవలన సౌభాగ్యవృద్ధి, భర్తృసౌఖ్యము, వివాహాది శుభకార్యములు, కుటుంబ, సంతాన సుఖము చెకూరగలదు. తెల్లనివస్త్రము, బియ్యము, వెండి దానము ఇచ్చుట శుభప్రదము.

## సింహరాశి

(మఘ, పుబ్బ, ఉత్తర 1 పా॥)

ఆదాయం: 5; వ్యయం: 5 రాజ పూ: 7; అవ: 7

ఈ రాశిజాతకులకు కొంతవరకు చికాకులు, స్థిరాస్థి వ్యయము, తప్పనిసరి కావచ్చును. కాని, జూలై ఆగస్టులలో కొంతమార్పు జరుగును. మొత్తముమీద ప్రారంభములో పరీక్షాకాలముగా తోచును. స్థిరమార్పులు కొంత అనుకూలముగానే చేయగల్గుదురు. వ్యవసాయ, వ్యాపారస్థులకు అనుకున్నంతగ లాభము కనుపించదు. యితరుల ఆస్థి లేక ధనము రాగల సూచనలు కలిగి ఆటంకములు సంభవించును. ఏ వృత్తివారైనను, 84 ఫిబ్రవరి, మార్చి నెలలందు జాగ్రత్తగా మసలుకొనవలసి యుండును. విద్యార్థులు యాత్ర, పుణ్యకార్య మూలకముగా అనగా దైవబలముతో ఉత్తీర్ణులు కాగల్గుదురు.

దాన్య, అవర, రసాయన, ఇనుము, కావ్య, లలితకళా, గణిత శాఖలవారికి మొదటి 6 మాసములు అనుకూలముగా నడచును. ఆరోగ్యవిషయములో జాగ్రత్త అవసరము. 1,4,10,13,21,31 తేదీలు ఆది, సోమ గురువారములతో కలసి వచ్చిన యోగప్రదము. రాజకీయములందు అధికార గౌరవము పొందగల్గుదురు.

8,9,12. ఇంగ్లీషు నెలలందు తెలివిగా మసలుకొనవలసి యుండును. సూర్యనమస్కారములు, శని స్తోత్రములు చేయుట మంచిది.

జాతి కెంపు లేక నీలము ధరించుటవలనను, తామరపుష్పము, రాగి, గోవు, గోధుమలు నువ్వులు దానము యిచ్చుటవలనను, నేత్ర, ఉష్ణ, రోగనివారణ. వ్యవహారజయము, అపమృత్యుదోష పరిహారము గౌరవ ధనలాభములు పొందగలుగుదురు.

స్త్రీలు శని. ఆదివారములు ఉపవాసములు చేయుట శుభప్రదము.

## కన్యారాశి

(ఉత్త 2, 3, 4 పా॥ హస్త, చిత్ర 1,2 పా॥)

ఆదాయం: 8; వ్యయం: 11 — రాజ పూ: 3; అవ: 3

అనుకొనని అవాంతరములు ఎదురగుచుండును. ఖర్చు. అపవాదులు, అనారోగ్య చికాకులు తట్టుకొనవలసియుండును. జూలై నెలాఖరువరకు చాలా మెలకువగా వ్యవహరించవలసి యుండును. తదుపరి క్రమకు తగినట్లు 60 వంతులు లాభము కనపడును. ఎక్కువ స్థిరసంపాదకులు కాలేరు. ఉత్తర ఖండములో ఉపకారము జరుగును. వ్యాపారస్థులకు దీపావళి తదుపరి లాభము కనబడును. సెప్టెంబరు, అక్టోబరు విల్వదారులకు అనుకూలము. అధికారలాభముచే ప్రభుత్వ చికాకులు తట్టుకొన గలుగుదురు. శుభకార్య ప్రయత్నములు ఈ సం॥ము విరమించుట మంచిది. విద్యార్థులకు పై చదువులకు అవకాశము లభించగలదు.

లాటరీ, ఎడిటర్. వేదాంత, జ్యోతిష, వైద్య, ప్రత్తి, నూనె, ఇనుము వ్యాపారవృత్తులవారికి అనుకూలత కనబడును. ఏది ఏమైన తెలివివి ఉపయోగించుకొని గడుపవలసియుండును. అన్యస్త్రీల వలన ఉపకారము ఆశించదగినదికాదు.

3,6,9,12,15,18,27 తేదీలు మంగళ, బుధ, శుక్రవారములతో కలసివచ్చిన యోగప్రదము, 6,9,12 ఇంగ్లీషు నెలలందు నూతన ఆలోచనలు, భూ, గృహమార్పులు చేయుటకు అనుకూలము కాదు. బాల, దుర్గాస్తోత్రజపములు చేయుటవలనను, పచ్చరాయి ధరించుట వలనను, పెసలు, కంబళి, ఆవునెయ్యి, పసుపు దానము యిచ్చుటవలనను వ్యాపారలాభము, విద్యార్థులకు గణిత జ్ఞానము కలుగును. నరముల విస్పత్తువ, బుద్ధిమాంద్యము మొ॥ నివారణ కాగలవు.

## తులారాశి

(చిత్ర 3,4 స్వాతి, విశాఖ 1,2,3 పా॥)

ఆదాయం: 5; వ్యయం: 14 — రాజ పూ: 6; అవ: 3

ఈ రాశిజాతకులు అక్టోబరువరకు చాలా మెలకువతో నుండవలసిన కాలము. అనారోగ్య సూచనలు, అకాల భోజనములు, అపవాదులు, సంసార ఈతిబాధలు, అస్థిమితము మొ॥ చికాకులు తెలివి వలన కొంతవరకు సమర్థించుకొన గలుగుదురు. కోర్టువ్యవహారములందు అపజయము, వృధా వ్యయము, ఋణచికాకులు జరుగవచ్చును. తదుపరి మధ్యమ ఫలితము సూచించును. రాజకీయములందు తమకన్న తక్కువవారి సహకారము కోరవలసియుండును. ఫలితము సామాన్యము. అయినను పన్మాన, గౌరవ ములు, ప్రభుత్వ అనుకూలత లభించగలదు. చింతపండు, మిర్చి. నూనె, పేపరు. యంత్ర మొ॥ వ్యాపార వృత్తులవారికి అంతగా ఆశించదగిన కాలముకాదు. విద్యార్థులు 1, 2 పాఠ్యాంశములందు ఉత్తీర్ణులగుదురు.

5, 10, 11 ఇంగ్లీషు నెలలు యోగ్యప్రదములు కావు. శుభకార్య, గౌరవ, దుర్వ్యసనములరీత్యా కొంత వృధా వ్యయము కాగలదు. మిత్రులు శత్రువులగుదురు. పుత్రమూలక అనుకూలత లభించును. ఆస్థినష్టము కలిగిన, కొంతచికాకులు తొలగును. సం॥ము మొత్తముమీద గతంకన్న ఆర్థికంగా మేలు కనబడును. 2 వ పంటలో లాభించగలదు.

6,15,24 తేదీలు శని. ఆది. శుక్రవారములు కలసివచ్చిన శుభప్రదము.

సుబ్రహ్మణ్య, కాళీస్తోత్రములు చేయుట మంచిది. జాతివజ్రము ధరించుటవలన సర్వకార్యసిద్ధి, మనోధైర్యము చేకూరగలదు.

## వృశ్చిక రాశి

( విశాఖ 4, అనూ, జ్యేష్ఠ )

ఆదాయం: 11; వ్యయం: 5 రాజ పూ: 2; అవ: 6

ఈ రాశి వ్యాపార ఉద్యోగస్థులకు మంచికాలము. విలపదారులు జాగ్రత్తపడడం మంచిది. నవంబరునెలనుండి అన్నివర్గములవారికి లాభము కనబడును. నెమ్మదిమీద పనులు సాధించుకొందురు. అధికార సంఘ గౌరవము, విదేశపర్యటన, రాజకీయ అనుకూలత, ధనవ్యయము, సమపాలుగా నడచును. ఆత్మీయులతో కలతలు, వలతలు తట్టుకొనవలసి యుండును. బుద్ధిని ఉపయోగించి అగ్రకులస్థులు మనలు కొనవలసియుండును. తక్కినవారికి మేలు కనబడును. ప్రయాణ, యాత్రాసిద్ధియు, ఉత్తరదిశయందు శుభకార్యలాభము చేకూరును. విద్యార్థులు 2 వ ఛాన్సు చూడవలసియుండును. అహంభావము తగ్గించు కొనుట మంచిది. లాటరీలు ప్రయత్నించరాదు. బాధ్యతలు యితరులపై పెట్టుటమంచిదికాదు.

4,6,10,11 ఇంగ్లీషు నెలలు యోగించవు. 9,18,27 తేదీలు మంగళ, గురు వారములు కలసిన మంచిది. బాకీలు మంగళవారమున తీర్చినమేలు కనబడును. న్యాయ, వృత్త, గణిత, శరణాలయముల వారికి మధ్యమఫలితము కనబడును.

గణపతి, లక్ష్మీనృసింహ స్తోత్రముచేయుట, రాగి, కందులు, ఎర్రనిపువ్వులు, వస్త్రములు దాన ములు యిచ్చుట, పగడము ధరించుటవలన ధైర్యము, ఋణవిముక్తి, అధికార, మాటచలాయింపులు మొ॥గు శుభఫలితము లిచ్చును.

## ధనూ రాశి

( మూల, పూ-షా, ఉ-షా 1 పా॥ )

ఆదాయం: 14; వ్యయం: 11 రాజ పూ: 1 అవ: 2

ఈ సం॥ము ఈ జాతకులు ఉపకారబుద్ధితో వ్యవహరించిన, అపవాదులు తప్పవు. మిత్ర, బంధు అవరోధములు ఎదురగుచుండును. ఔషధ, అలంకారములకు వృధా వ్యయము చేయవలసివచ్చును. ఏ పనియైనను 2,3 ప్రయత్నములపై కాని ఫలించవు. ఎంత చాకచక్యము కలవారైనా యితరుల సహా యము కోరవలసి వుండును. వృత్తి, ఉద్యోగస్థులు ఏది ఎలా జరిగిన మన మంచికే అనునట్లు తృప్తిపడ వలసిన కాలము. రాజకీయ వత్తిడికి లొంగిన కార్యసాధకులు కాగలుగుదురు. విద్యార్థులకు అనుకూల మైన ఫలితములు కలుగును. అబద్ధములు అవసరములకు ఆడకతప్పదు. రైతులకు మొదటిపంట, మెరక సస్యములు ఫలించును. తూర్పు, పడమర, తప్పిన ఉత్తర దిశలందు డిశంబరు తదుపరి శుభకార్య యత్న లాభము చేకూరును. దేవతా గురుభక్తులు వీరికి ఆశీస్సులు కాగలవు.

L. I. C., కవిత, ఉపాధ్యాయ, దేవాదాయ, పురోహిత వృత్తులవారికి అనుకూల ఫలితములు కనబడును, చర్మ, అజీర్తి సంబంధమగు అనారోగ్యమువందును, 2, 6. 9, 12 ఇంగ్లీషు నెలలందును రామకృష్ణ స్తోత్రము చేయుట శుభప్రదము,

3,12,21,30 తేదిలు బుధ, గురు, ఆదివారములతో కలసివచ్చిన యోగప్రదము.

జాతిపుష్యరాగము ధరించుటవలనను, పంచదార, ఉప్పు, శనగలు, పట్టువస్త్రములు దానములు యిచ్చుటవలనను శత్రుజయము, ఋణవిముక్తి, సంతానసౌఖ్యము, మనోల్లాసము, గృహజీవితానందము మొ॥గు శుభఫలితములు సమకూరును.

## మకరరాశి

(ఉ-షా 2,3,4 పా॥ శ్రవణ, ధనిష్ఠ 1 2 పా॥)

ఆదాయం: 2; వ్యయం: 8 రాజ పూ: 1; అవ: 2

ఈ రాశివారికి అనుకున్నంతగా ఆశించదగిన కాలము కాదు. హితులన్నవారు కలసిరారు. యితరులపై బాధ్యతలు ఉంచక తనపని తాను చేసుకొనుటలో వ్యయమునకు తట్టుకోగలిగి కొంతతృప్తిని పొందగలుగుదురు. మార్పుకనిపించు సూచనలున్నను, ప్రయత్నములందు అశ్రద్ధ చేయకూడదు. అనుకోని అవాంతరములు ఎదురగుచుండును. వ్యవసాయదారులకు 2 వ పంట లాభించును. వ్యాపారస్థులకు అక్టోబరువరకు చికాకులు, ధనవత్తిడి, తదుపరి మధ్యమఫలితము కనబడును. గతములో ఉన్నలోటును భర్తీచేయ గలుగుదురు.

ఇనుము, కలప, రాయి, యంత్ర, నూనె, బొగ్గు వ్యాపారస్తులు నిదానముపై లాభములు పొందగలుగుదురు. గురు దోష పరిహారమునకు కొంత శాంతి జరిగించుకొనుటకు మంచిది. సినిమా, లాటరీ, జూదము మొ॥గు వారికి అక్టోబరు తదుపరి కొంతలాభము కనబడును. వస్త్ర, వాహన శుభకార్యములకు వ్యయము చేయుట జరుగును.

సం॥ము ఆఖరులో కొంతమేలు కనబడును. కంట్రాక్టు, యంత్ర పనివారలకు అస్థిరత్వము కలిగినను చికాకులు తొలగిపోవును.

8,17,26 తేదీలు శని, ఆది, సోమవారములు మంచిది. 1,2,7,12, ఇంగ్లీషు నెలలు మంచివి కావు. కాళీ, శనిస్తోత్రము చేయుట, జాతి నీలము ధరించుట, ఇనుము, నువ్వులు, నల్లని వస్త్రము, మంచి నూనె దీపదానములు చేయుటవలన అపమృత్యు అనారోగ్యబాధలు తొలగును. గౌరవము, సంఘములో పలుకుబడి, ధనలాభము సిద్ధించును.

## కుంభరాశి

( ధనిష్ఠ 3,4, శత, పూర్వాభాద్ర 1,2,3 పా॥ )

ఆదాయం : 2; వ్యయం : 8 రాజ పూ : 4; అవ: 2

ఈ రాశి జాతకులకు సం॥ము పట్టింది బంగార మనునట్లు యోగకాలమని చెప్పవచ్చును అక్టోబరువరకు మంచిది. తదుపరి 5 మాసములు మధ్యమ ఫలితములు కనబడును. వ్యవసాయదారులకు 2 వ పంట ఆశించతగినంత ఫలితము కనబడదు. యంత్ర, మిర్చి, పేపరు, లలితకళలు, విద్యా వినోద, బెల్లం, అపరాలు వర్తకులకు లాభములు కలసివచ్చును. భూ, గృహ, స్థిరాస్థులు మార్పు, లాభము కనబడును. ప్రతిపనియు స్వయంకృషితో, గౌరవాధికారములతో సాధించగలుగుదురు. రాజకీయములందు అనుకూలత రానిబాకీలు వచ్చుట, ఋణచికాకులు తొలగుట జరుగును. విద్యార్థులు అహంభావము విడచి చదివినచో ఉత్తీర్ణులు కాగలుగుదురు. ఉద్యోగస్తులకు అనుకూలమార్పులు జరుగును. ప్రయాణముల వత్తిడి యెక్కువ. నవంబరు లగాయితు అనారోగ్య సూచనలు కలిగిన బాధించునవికావు. స్త్రీవర్గరీత్యా వ్యయం తప్పదు. రూపాయకు 12 అణాల వంతున లాభించును. నవంబరు తదుపరి అభిషేకములు. సూర్య స్తవము జరిపించుకొనుట మంచిది.

పుష్యరాగ, నీలములు ధరించుటవలన ఇనుము, తెల్లవస్త్రములు, తెల్లనిపువ్వులు, నువ్వులు దానము లిచ్చుటవలన వంశవృద్ధి, ఆరోగ్యసిద్ధి, మనోల్లాసము సిద్ధించును.

3,7,12 ఇంగ్లీషు నెలలు యోగించవు. 8,17,26 తేదీలు శని, ఆది, గురు సోమవారములతో కలసివచ్చిన యోగప్రదములు కాగలవు.

## మీనరాశి

( పూర్వాభాద్ర 4, ఉ-భాద్ర, రేవతి )

ఆదాయం : 14; వ్యయం : 11 రాజ పూ : 7; అవ : 2

ఈ రాశివారు మాటలతోకాక చేతలతో కార్యసాధకులై వ్యక్తిత్వమును కనబరచుకొందురు. వ్యవసాయదారులకు 10 అణాల వంతున లాభము కనబడును. వ్యవహార ఋణచికాకులు ఆశ్వయుజము తదుపరి తొలగిపోవును. కుటుంబకలతలు కలిగిన, ఆదాయముబట్టి సమర్థించుకొనగలుగుదురు. వ్యాపారపెట్టుబడులు, కంట్రాక్టుపనులు, నవంబరు తదుపరి తగ్గించుకొనుట మంచిది, పరస్పర సహకారము, దైవభక్తి, మాట మంచితనము వీరి అభివృద్ధికి మార్గములు కాగలవు. విద్యార్థులకు అనుకూలకాలము. దుర్వ్యసనములకు దూరముగానుండుట మంచిది. ఏ రంగములో నున్నవారికైనా కార్తీకము తదుపరి సామాన్యముగా నడచును. గురు, శనులకు స్వల్పశాంతి జరిగించుకొనుట మంచిది.

6,9,12 ఇంగ్లీషునెలలందును వ్యయము, చికాకులు గురు శుక్ర వారములతో కలసివచ్చిన 3,12,21,30 తేదీలు మంచివి. జాతి పుష్యరాగము ఉంగరములో ధరించుట, శివ, విష్ణు, నామములు స్మరించుట శుభప్రదము.

వైఢూర్యము, కంబళి, పట్టు వస్త్రములు, పంచదార, సెనగలు దానము యిచ్చుటవలన సర్వ కార్య సిద్ధియు, కుటుంబ శుభకార్య అనుకూలతయు సిద్ధించును.

3

# 4. శుభముహూర్తములు

## చైత్రమాసము

1983 ఏప్రిల్ నెల

14 శు ౧ గు|| అశ్విని నూతనాలంకారధారణము,
వృషభం ఉ. 8–43

16 ౩ శ|| రోహిణి వివాహగర్భాధానాదులు
వృశ్చికము రా. 8–53
వివాహాదులు మీనము తె. 4–41

17 ౪ ఆది|| మృగశిర వివాహ గృహారంభ ప్రవేశాదులు
కుంభం రా. 3–52

18 ౫ సో|| మృగశిర ఉపనయన అక్షరస్వీకార గృహారంభ
ప్రవేశాదులు వృషభము ఉ. 8–18

20 ౭ బుధ|| పునర్వసు గృహారంభ ప్రవేశాదులు
వృషభము ఉ. 8–10
గృహారంభ ప్రవేశాదులు మీనము రా. 4–24

22 ౧౦ శుక్ర|| మఘ వివాహాదులు వృశ్చికము రా. 8–28

24 ౧౨ ఆది|| ఉ. ఫ. వివాహ గృహారంభప్రవేశాదులు
వృషభం ఉ. 8–8
వివాహ గర్భాధాన గృహప్రవేశాదులు వృశ్చికము రా. 8–20

27 ౧౫ బుధ|| స్వాతి వివాహాదులు మకరము రా. 12–51

28 బ ౧ గురు|| విశాఖ గర్భాధానమునకు
వృశ్చికము రా. 8–5

29 ౨ శు|| అనూ వివాహ గర్భాధాన గృహప్రవేశాదులు
వృశ్చికము రా. 8–1

మే నెల

1 ౪ ఆది|| మూల వివాహనిషేకాదులు
వృశ్చికము రా. 7–54

4 ౭ బు|| ఉ-షా అన్నప్రాశన, ఉపనయన
గృహారంభ ప్రవేశాదులు వృషభం ఉ. 7–31

6 ౯ శు|| ధనిష్ఠ ఉపనయన వివాహ గృహారంభ
ప్రవేశాదులు వృషభం ఉ. 7–23
శత వివాహ గృహారంభ ప్రవేశాదులు మీనము రా. 3–22

## వైశాఖమాసము

14 శు ౨ శని|| రోహిణి ఉపనయన వివాహాదులు
కర్కా ప. 10–40
వివాహ గర్భాధానాదులు మకరము రా. 11–47

18 ౬ బు|| పుష్య ఉపనయనాదులు కర్కా ప. 10–22

23 ౧౧ సో|| చిత్ర అన్నప్రాశనోపనయనాదులు
కర్కా ప. 10–1

26 ౧౪ గురు|| అనూరాధ వివాహాదులు మీనము రా. 1–58

29 బ ౩ ఆది|| మూల ఉపనయన వివాహ
గృహారంభాదులు కర్కా ఉ. 9–39

జూన్ నెల

1 ౫ బు|| శ్రవణము ఉపనయన వివాహ
గృహారంభాదులు కర్కాటకం ఉ. 9–26

3 ౭ శు|| శత వివాహ గర్భాధానాదులు
మకరము రా. 10–21

5 ౯ ఆది|| ఉ. భా. ఉపనయన గృహారంభ
వివాహాదులు కర్కాటకం ఉ. 9–11

6 ౧౦ సోమ|| రేవతి ఉపనయన గృహారంభాదులు
కర్కాటకం ఉ. 9–8

## జ్యేష్ఠమాసము

13 శు ౨ సో|| పున ఉపనయనాదులు కర్కా ఉ. 8–40
గర్భాధానము మకరము రా 9–43

19 ౯ ఆది|| హస్త వివాహ గృహారంభములు
కర్కాటకం ఉ. 8–17
చిత్ర గృహప్రవేశ గర్భాధానాదులు కుంభము రా. 11–45

23 ౧౩ గురు|| అనూ అక్షరస్వీకార వివాహాదులు
కర్కాటకం ఉ. 8–1

26 బ ౧ ఆది|| పూ. షా. గర్భాధానము
కుంభము రా. 11–14

27 ౨ సోమ|| ఉ. షా. వివాహ గర్భాధానములు
మకరము రా. 8–54

29 ౪ బుధ॥ ధనిష్ఠ వివాహ గర్భాధానాదులు
మకరము రా. 8–45
వివాహ గృహప్రవేశాదులు వృషభము రా. 3–50

30 ౫ గురు॥ శత వివాహ గర్భాధానము
మకరము రా. 8–41

జూలై నెల

2 ౭ శని॥ ఉ. భా. వివాహ గర్భాధాన గృహ
ప్రవేశాదులు మీనము రా. 11–38

## ఆషాఢమాసము

18 శు ౯ సోమ॥ స్వాతి అన్నప్రాశనము సింహము ఉ. 9–31

24 ౧౫ ఆది॥ ఉ. షా. అన్నప్రాశన సీమంతాదులు
సింహము ఉ.9–5

25 బ ౧ సోమ॥ శ్రవణం అన్నప్రాశనము
సింహము ఉ. 9–1

27 ౩ బు॥ ధనిష్ఠ అన్నప్రాశనము సింహము ఉ. 8–52

ఆగష్టు నెల

4 ౧౦ గురు॥ రోహిణి అన్నప్రాశనము సింహము ఉ. 8–23

## శ్రావణమాసము

10 శు ౩ బుధ॥ మఘ వివాహము సింహము ఉ. 7–59

11 ౪ గురు॥ ఉ. ఫ. వివాహము మిథునము రా. 3–50

13 ౫ శని॥ చిత్తా గర్భాధానము మీనము రా. 8–53

14 ౭ ఆది॥ చిత్తా గృహారంభప్రవేశాదులు
సింహము ఉ. 7–32
స్వాతి వివాహ గర్భాధాన నవ గృహప్రవేశాదులు కుంభం
రా. 8–3

18 ౧౦ గురు॥ మూల వివాహ గృహారంభాదులు
మిథునము రా. 3–25

21 ౧౩ ఆది॥ ఉ. షా. అన్నప్రాశనము కన్య ఉ. 8–52

సెప్టెంబరు నెల

1 బ ౯ గురు॥ మృగ వివాహ గృహారంభ
ప్రవేశాదులు కన్య ఉ. 8–3
రాత్రి గర్భాదాన గృహప్రవేశాదులు మీనము రా. 7–39

2 ౧౦ శుక్ర॥ ఆర్ద్ర గర్భాధానము మీనము రా. 7–35

## భాద్రపదమాసము

8 శు ౩ గురు॥ ఉ. ఫ. అన్నప్రాశనము కన్య ఉ. 7–41

11 ౫ ఆది॥ స్వాతి అన్నప్రాశనాదులు కన్య ఉ. 7–29

## ఆశ్వయుజమాసము

అక్టోబరు నెల

9 శు ౩ ఆది॥ అనూ వివాహాదులు కర్కా రా. 12–53

13 ౭ గురు॥ పూ. షా. గర్భాధానము మిథునం
రా. 11–44

16 ౧౦ ఆది॥ శ్రవణము నూతన వ్యాపారాదులు
వృశ్చికము ఉ. 8–34

21 ౧౫ శుక్ర॥ రేవతి నూతన వ్యాపారాదులు మీనము
సా. 4–18
అశ్విని వివాహము మిథునము రా. 11–21

22 బ ౧ శని॥ అశ్విని వివాహాదులు ధనస్సు ప. 11–42

24 ౩ సో॥ రోహిణి గర్భాధానము మిథునము రా. 11–0

28 ౭ శు॥ పుష్య గర్భాధానము మిథునము రా. 10–45

30 ౯ ఆది॥ మఘా వివాహము వృషభము రా. 7–45

## కార్తీకమాసము

నవంబరు నెల

6 ౩ ఆది॥ అనూ వివాహ గర్భాధానములు మిథునము
రా. 10–8

10 ౬ గురు॥ ఉ. షా. వివాహ గర్భాధానములు కర్కా
రా. 10–50

11 ౭ శుక్ర॥ శ్రవణము వివాహ గర్భాధానములు
కర్కా రా. 10–46

13 ౯ ఆది॥ శత వివాహ గృహ ప్రవేశాదులు సింహము
రా. 1–48

16 ౧౧ బుధ॥ ఉ. భా. వివాహ గృహారంభ ప్రవేశాదులు
వృశ్చికము ఉ. 6–51
వివాహ గృహప్రవేశాదులు మిథునము ఉ. 9–29

17 ౧౨ గురు॥ రేవతి వివాహ గృహప్రవేశాదులు
మిధునము రా. 9–26

18 ౧౩ శుక్ర॥ అశ్విని వివాహ నిషేకాదులు కర్కా
రా. 10–0

23 బ ౩ బుధ॥ ఆర్ద్రి గర్భాధానము కర్కా రా. 10–7

27 ౭ ఆది॥ మఘా వివాహము మిథునము రా. 8–27

## మార్గశిరమాసః

డిశంబరు నెల

9 శు ౫ శుక్ర॥ శ్రవణము అన్నప్రాశనము మకరము
ఉ. 10–7

22 బ ౩ గురు॥ పున అన్నప్రాశనము మకరము ఉ. 9–13

26 ౭ సో॥ ఉ. ఫ. అన్నప్రాశనము మకరము ఉ. 8–58

29 ౧౦ గురు॥ స్వాతి అన్నప్రాశనము మకరము ఉ. 8–47

## పౌషమాసః

1984 జనవరి నెల

8 శు ౫ ఆది॥ శత అన్నప్రాశనము మకరము ఉ. 8–6

16 ౧౩ సోమ॥ మృగ అన్నప్రాశనము కుంభము ఉ. 9–56

19 బ ౧ గురు॥ పుష్య అన్నప్రాశనము కుంభము
ఉ. ౦–44

## మాఘమాసః

ఫిబ్రవరి నెల

4 శు ౨ శని॥ పూ. భా. గర్భాధానము సింహము రా. 8–20

5 ౩ ఆది॥ ఉ. భా. వివాహము ధనుస్సు తె. 4–43

6 ౪ సోమ॥ ఉ-భా. గర్భాధాన నవగృహ ప్రవేశాదులు కన్య
రా. 9–45

8 ౬ బుధ॥ అశ్విని ఉపనయన వివాహ గృహారంభాదులు
కుంభము ఉ. 8–26

11 ౯ శ॥ రోహిణి ఉపనయన వివాహాదులు మీనము
ఉ. 9–3

వివాహ గర్భాధాన గృహప్రవేశాదులు సింహము రా. 8–59
వివాహ గృహారంభ ప్రవేశాదులు ధనస్సు తె. 4–19
వివాహము గర్భాధానాదులు కన్య రా. 7–59

12౧౦ ఆది॥ మృగ ఉపనయన వివాహ గృహారంభ
ప్రవేశాదులు కుంభము ఉ. 8–8
వివాహ గర్భాధాన గృహ ప్రవేశాదులు సింహము రా. 8–6
వివాహ గృహారంభ ప్రవేశాదులు ధనుస్సు తె. 4–14

15 ౧౩ బుధ॥ పుష్య గృహప్రవేశ గర్భాధానాదులు కన్య
రా. 9–8

16 ౧౪ గురు॥ మఘా వివాహము ధనుస్సు రా. 3–59

17 ౧౫ శుక్ర॥ మఘా వివాహము కన్య రా. 9–0

18 బ ౧ శని॥ ఉ. ఫ. వివాహ గర్భాధానాదులు కన్య
రా. 8–57

19 ౩ ఆది॥ హస్త వివాహ గర్భాధానాదులు కన్య రా. 8–53

23 ౭ గురు॥ అనూ వివాహగృహారంభ ప్రవేశాదులు
ధనుస్సు రా. 3–31
వివాహ గృహారంభాదులు మకరము తె. 5–6

26 ౧౦ ఆది॥ మూల ఉపనయన గృహారంభాదులు
మీనము ఉ. 7–56

## ఫాల్గుణమాసము

మార్చి నెల

4 శు ౨ ఆది॥ ఉ. భా. ఉపనయన వివాహాదులు
మీనము ఉ.7–29

5 ౩ సోమ॥ రేవతి అక్షరస్వీకార యాత్రాదులు మీనము
ఉ. 7–25

9 ౭ శుక్ర॥ రోహిణి వివాహ గృహప్రవేశ గర్భాధానాదులు
కన్య రా. 7–36
వివాహ గృహప్రవేశ గృహారంభాదులు ధనుస్సు రా. 2–31

10 ౮ శని॥ మృగ వివాహ గృహారంభ ప్రవేశాదులు
ధనుస్సు రా. 2–27

11 ౯ ఆది॥ మృగ ఉపనయన వివాహగృహారంభ
ప్రవేశాదులు మీనము ఉ. 6–57

12 ౧౦ సోమ॥ పున గర్భాధానము కన్య రా. 7–25

15 ౧౩ గురు॥ మఘ వివాహము ధనుస్సు రాత్రి 2–7

17 ౧౫ శని॥ ఉ-ఫ వివాహ గృహప్రవేశాదులు
ధనుస్సు రా. 2–0
వివాహ గృహారంభాదులు మకరము రా. 3–32

21 బ ౪ బుధ॥ అనూ వివాహ గృహ ప్రవేశాదులు
ధనుస్సు రాత్రి 1–41

25 ౮ ఆది॥ ఉ-షా వివాహ గృహప్రవేశాదులు ధనుస్సు
రా. 1–24
వివాహ గృహారంభ ప్రవేశాదులు కుంభము తె. 5–18

## శ్రీ రుధిరోద్గారినామ సంవత్సర వ్రతదినపట్టిక.

| 1983–84 | శుక్లపక్షము | | | | కృష్ణపక్షము | | | | నక్షత్రములు | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| మాసములు | ప్రతిపత్ | షష్ఠి | ఏకాదశి | పూర్ణిమ ○ | ప్రతిపత్ | ఏకాదశి | మాసశివరాత్రి | అమావాస్య ● | కృత్తిక | రోహిణి | ఆర్ద్ర | పునర్వసు | శ్రవణం |
| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 |
| ఏప్రిల్ | 14 | 18 | 23 | 27 | 28 | — | — | — | 16 | 17 | 19 | 20 | 7 |
| మే | 13 | 18 | 23 | 26 | 27 | 8 | 19 | 12 | 13 | 14 | 16 | 17 | 5 |
| జూన్ | 12 | 16 | 21 | 25 | 26 | 7 | 9 | 10 | 9 | 10 | 12 | 13 | 1,28 |
| జూలై | 11 | 15 | 20 | 24 | 25 | 6 | 9 | 10 | 7 | 8 | 10 | 11 | 26 |
| ఆగష్టు | 9 | 14 | 19 | 23 | 24 | 5 | 7 | 8 | 3,30 | 4,31 | 6 | 7 | 22 |
| సెప్టెంబరు | 8 | 12 | 17 | 22 | 23 | 3 | 5 | 6 | 27 | 28 | 2,30 | 3 | 18 |
| అక్టోబరు | 7 | 12 | 17 | 21 | 22 | 3* | 5 | 6 | 24 | 25 | 27 | 1,28 | 15 |
| నవంబరు | 5 | 10 | 16 | 20 | 21 | 1,30 | 3 | 4 | 20 | 21 | 23 | 24 | 12 |
| డిసెంబరు | 5 | 10 | 16 | 19 | 20 | 30 | 2 | 4 | 18 | 19 | 21 | 22 | 9 |
| జనవరి 84 | 4 | 9 | 14 | 19 | 18 | 28 | 31 | 2 | 14 | 15 | 17 | 18 | 5 |
| ఫిబ్రవరి | 2 | 8 | 13 | 16 | 17 | 27 | 29 | 1 | 10 | 11 | 13 | 14 | 2 |
| మార్చి | 3 | 8 | 13 | 17 | 18 | 28 | 30 | 2 | 9 | 10 | 12 | 13 | 27 |
| | — | — | — | — | — | — | — | — | — | — | — | — | — |

ఇందు *గుర్తుగల తేదీకి పూర్వదినమున స్మార్తైకాదశి యగును.

## 5. శుభముహూర్తములకు యోగ్యమగు తిథివార నక్షత్రలగ్నములను తెలుపు చక్రము

**ఈ ముహూర్తములకు ఏకవింశతి మహాదోషములు లేక యుండవలెను**

**పాపగ్రహాక్రాన్త, వేధ, రాహిత్యముగూడా యుండవలెను.**

| ముహూర్తము | తిథులు | వారములు | నక్షత్రములు | లగ్నములు | విశేషములు |
|---|---|---|---|---|---|
| నిషేకము | 2-3-5 7-10 | సో-బు గు-శు | అ-రో-ఉఫ-హ-స్వా-అనూ ఉషా-శ్ర-శత-ఉభా | వృష-మిథు-కట కన్య-తు-ధ-మీ | లగ్నశుద్ధి మాఘాది పంచకము శుభము |
| గర్భాదానము | 2-3-5 7-10-13 | సో-బు గు-శు | రో-మృ-పున-పుష్య-ఉఫ-హ చి-స్వా-అనూ-ఉషా-శ్ర-ధ శత-ఉభా | వృష-కట-కన్య-తు ధను-మీనం | ౧-౭ శుద్ధి పంచపర్వ ములు కూడవు |
| పుంసవనము సీమంతము | 2-3-5-7 10-13 శు | సో-బు గు-శు | అశ్వ-రో-మృ-పున-పుష్య ఉఫ-హ-చి-స్వా-అనూ-మూ ఉషా-శ్ర-ధ-శత-ఉభా-రే | మే-వృ-సిం లగ్నములు కాక ఇతర లగ్నములు శుభం | 4-8 మాసములు |
| జాతకర్మ నామకరణం | 2-3-5-7 10-13 శు | సో-బు గు-శు | అశ్వ-రో-పున-పు-ఉఫ-హ స్వా-అనూ-ఉషా-శ్ర-ధ శత-ఉభా | వృ-మి-కటక-కన్య తుల-ధ-మీ | అష్టమశుద్ధి నక్షచ్ఛిద్రములు కూడదు |
| డోలా రోహణం | 2-3-5-7 10-13 | సో-బు గు-శు | అశ్వ-రో-మృ-పున-పు ఉఫ-హస్త-చి-అనూ ఉషా-ఉభా-రేవతి | వృ-మి-కట-కన్య-తు ధను-మీనం | 1-3-5 మాసములు అష్టమశుద్ధి |
| అన్నప్రాశనం | 2-3-5-7 10-13 | సో-బు గు-శు | అశ్వ-రో-మృ-పున-పు-ఉఫ హ-చి-స్వా-అనూ-ఉషా-శ్రవ ధ-శత-ఉభా-రేవతి | వృ-మిథు-కన్య-కట ధను-మీనం | 10 శుద్ధి పురుషులకు సరిమాసం స్త్రీలకు బేసిమాసం |
| కర్ణవేధ | 2-3-5-7 10-13 | సో-బు గు-శు | అశ్వ-మృ-పున-పుష్య-ఉఫ హస్త-చి-అనూ-ఉషా-శ్రవ ధని-ఉభా-రే | వృ-మి-కటక-కన్య ధను-మీనం | అష్టమశుద్ధి 6-7-8 మాసములు |
| కేశఖండనము | 2-3-5-7 10-13 | సో-బు గు-శు | అశ్వ-మృ-పున-పుష్య-హ చి-స్వా-శ్ర-ధ-శత-రే | వృ-మి-కటకం-కన్య తుల-ధను-మీనం | ఉత్తరాయణం పూర్వయామం |
| అక్షరా భ్యాసము | 2-3-5 7-10 | సో-బు గు-శు | అశ్వ-పున-పుష్య-హ-చి స్వాతి-అనూ-శ్ర-రే | మే-కట-తు-మకర | అష్టమశుద్ధి ఉత్తరా యణము ౫-వ సంవ త్సరము |
| విద్యాభ్యాసము | 2-3-5 7-10 | ఆ-సో-బు గు-శు | అశ్వ-మృ-పున-పుష్య-ఆర్ద్ర ఆశ్రే-హ-చి-స్వా-మూ-శ్ర | కట-తుల-మక మీనం-మేషం | అష్టమశుద్ధి అనధ్యాయ రహితం |

# శుభముహూర్తములకు యోగ్యమగు తిథివార నక్షత్రలగ్నములను తెలుపు చక్రము

ఈ ముహూర్తములకు ఏకవింశతి మహాదోషరాహిత్యము యుండవలెను.

పాపగ్రహాక్రాన్త, వేధ, రాహిత్యముగూడా యుండవలెను,

| ముహూర్తములు | తిథులు | వారములు | నక్షత్రములు | లగ్నములు | విశేషములు |
|---|---|---|---|---|---|
| ఉపనయనము | 2-3-5-7-10 కృ 2-3 | బు-గు-శు | అశ్వి-రో-మృ-పున-పుష్య ఉఫ-హ-చి-స్వా-అనూ-ఉషా శ్ర-ధ-శ-ఉభా-రే | వృష-మిథున-కటక కన్య-ధను-మీనం | రా శుద్ధి అనధ్యయన కూడదు కేంద్రమున పాపులుండకూడదు |
| వివాహం | 2-3-5-7 10-13 | బు-గు-శు | రో-మృ-మఘ-ఉఫ-హ స్వా-అనూ-మూ-ఉషా ఉభా-రే | వృష-మిథు-కట-తుల కన్య-ధను-మీనం | సప్తమశుద్ధి మాఘాది పంచకం |
| నూతన వస్త్రధారణం | 2-3-5-7 10-13 | సో-బు గు-శు | అశ్వి-రో.మృ-పున-ఉఫ-హ చి-స్వా-అనూ-మూ-ఉషా శ్ర-ధ-శత-ఉభా-రే | వృష-మిథు-కట కన్య-తుల-ధ-మీనం | తృతీయశుద్ధి |
| శంకుస్థాపనం | 2-3-5-7 10-13 | బు-గు-శు | అశ్వి-రో-మృ-పున-పు-ఉఫ హ-చి-స్వా-అనూ ఉషా-శ్ర-ధ-శత-ఉభా | వృష-మిథు-కన్య ధను-మీనం | చతుర్థశుద్ధి అష్టమశుద్ధి |
| గృహ ప్రవేశము | 2-3-5-7 10-13 | బు-గు-శు | రో-మృ-ఉఫ-చి-అనూ ఉషా-ధ-శత-ఉభా-రే | వృష-మిథు-కన్య ధను-మీనం | చతుర్థశుద్ధి అష్టమశుద్ధి వృషభకలశ చక్రశుద్ధి స్థిరలగ్నము |
| కూపారంభం | 2-3-5-7 10-13 | సో-గు-శు | రో-పుష్య-మృ-ఉఫ-హ అనూ-ఉషా-శ్ర-ఉభా | కట-మక-మీనం | లగ్నమున చంద్ర శుక్రులు ఉత్తరము తూర్పు ఈశాన్యం శుభం |
| ప్రయాణం | 2-3-5-7 10-13 | సో-బు గు-శు | అశ్వి-మృ-పున-పుష్య-హ అనూ-శ్ర-ధ-రే-మూల | మేష-వృష-కట కన్య-తుల-ధను మీనం | వారశూలలు కూడదు |
| బీజావాపనం | 2-3-5-7 10-13 | సో-బు గు-శు | అశ్వి-రో-మృ-పుష్య-ఉఫ హ-స్వా-అనూ-ఉషా-శ్ర-ధ ఉభా-రేవతి | వృష-మిథు-కటక కన్య-ధను-మీనం | విత్తనముల రంగు ననుసరించినవారములు మంచివి |
| క్షౌరం | 2-3-5-7 13 | సో-బు | అశ్వి-మృ-పున-పు-హ-చి స్వా-శ్ర-ధ-శత | వృష-మిథు-కట-తుల ధను-మీనం | భోజనానన్తరం కూడదు భార్య 5 మాసములు గర్భవతిగనుండ కూడదు |
| వాణిజ్యం | 2-3-5-7 10-13 | సో-బు గు-శు | అశ్వి-రో-మృ-పుష్య-హ చి-అనూ-రేవ-ఉత్త-ఉ-షా ఉ-భా | వృష-మిథు-కట కన్య-తు-ధ-మీనం | లాభ 11 స్థానమున శుభగ్రహముగాని దృష్టిగాని శుభము |

# తిరుపతి (వేంకటాద్రి) ప్రాంతమందు సూర్యోదయాస్తమయకాలములు

| 1983 సం॥ | తేది | సూ. ఉ. | | సూ. అ. | |
|---|---|---|---|---|---|
| | | గం. | వి. | గం. | వి. |
| ఏప్రిల్ | 14 | 6 | 5 | 6 | 26 |
| | 15 | 6 | 3 | 6 | 28 |
| | 20 | 6 | 3 | 6 | 26 |
| | 25 | 6 | 2 | 6 | 26 |
| | 30 | 6 | 57 | 6 | 26 |
| మే | 5 | 6 | 56 | 6 | 28 |
| | 10 | 5 | 54 | 6 | 28 |
| | 15 | 5 | 52 | 6 | 29 |
| | 20 | 5 | 51 | 6 | 28 |
| | 25 | 5 | 50 | 6 | 31 |
| | 30 | 5 | 49 | 6 | 32 |
| జూన్ | 4 | 5 | 48 | 6 | 33 |
| | 9 | 5 | 48 | 6 | 35 |
| | 14 | 5 | 48 | 6 | 36 |
| | 19 | 5 | 49 | 6 | 38 |
| | 24 | 5 | 50 | 6 | 40 |
| | 29 | 5 | 51 | 6 | 41 |
| జూలై | 4 | 5 | 52 | 6 | 42 |
| | 9 | 5 | 53 | 6 | 44 |
| | 14 | 5 | 55 | 6 | 44 |
| | 19 | 5 | 56 | 6 | 45 |
| | 24 | 5 | 58 | 6 | 46 |
| | 29 | 5 | 59 | 6 | 46 |
| ఆగష్టు | 3 | 5 | 0 | 6 | 46 |
| | 8 | 5 | 2 | 6 | 46 |
| | 13 | 6 | 3 | 6 | 45 |
| | 18 | 6 | 4 | 6 | 44 |
| | 23 | 6 | 4 | 6 | 42 |
| | 28 | 6 | 5 | 6 | 40 |
| సెప్టెంబరు | 2 | 6 | 6 | 6 | 38 |
| | 7 | 6 | 6 | 6 | 36 |
| | 12 | 6 | 6 | 6 | 33 |
| | 17 | 6 | 6 | 6 | 30 |
| | 22 | 6 | 7 | 6 | 26 |
| | 27 | 6 | 7 | 6 | 23 |
| అక్టోబరు | 2 | 6 | 8 | 6 | 19 |
| | 7 | 6 | 8 | 6 | 16 |
| | 12 | 6 | 8 | 5 | 2 |
| | 17 | 6 | 9 | 5 | 58 |

| 1983–84 సం॥ | తేది | సూ. ఉ. | | సూ. అ. | |
|---|---|---|---|---|---|
| | | గం. | వి. | గం. | వి. |
| అక్టోబరు | 22 | 6 | 10 | 5 | 52 |
| | 27 | 6 | 11 | 5 | 50 |
| నవంబరు | 1 | 6 | 12 | 5 | 48 |
| | 6 | 6 | 13 | 5 | 46 |
| | 11 | 6 | 16 | 5 | 44 |
| | 16 | 6 | 18 | 5 | 43 |
| | 21 | 6 | 20 | 5 | 43 |
| | 26 | 6 | 22 | 5 | 43 |
| డిశంబరు | 1 | 6 | 25 | 5 | 44 |
| | 6 | 6 | 28 | 5 | 44 |
| | 11 | 6 | 30 | 5 | 46 |
| | 16 | 6 | 34 | 5 | 48 |
| | 21 | 6 | 36 | 5 | 50 |
| | 26 | 6 | 40 | 5 | 54 |
| | 31 | 6 | 42 | 5 | 57 |
| 1984 | | | | 5 | |
| జనవరి | 5 | 6 | 43 | 6 | 59 |
| | 10 | 6 | 45 | 6 | 2 |
| | 15 | 6 | 46 | 6 | 5 |
| | 20 | 6 | 46 | 6 | 8 |
| | 25 | 6 | 46 | 6 | 11 |
| | 30 | 6 | 46 | 6 | 14 |
| ఫిబ్రవరి | 4 | 6 | 45 | 6 | 16 |
| | 9 | 6 | 44 | 6 | 18 |
| | 14 | 6 | 42 | 6 | 19 |
| | 19 | 6 | 40 | 6 | 20 |
| | 24 | 6 | 37 | 6 | 22 |
| మార్చి | 1 | 6 | 34 | 6 | 22 |
| | 6 | 6 | 31 | 6 | 23 |
| | 11 | 6 | 28 | 6 | 24 |
| | 16 | 6 | 24 | 6 | 25 |
| | 21 | 6 | 22 | 6 | 25 |
| | 26 | 6 | 18 | 6 | 25 |
| | 31 | 6 | 14 | 6 | 26 |
| ఏప్రిల్ | 1 | 6 | 11 | 6 | 62 |

ఓమ్

శ్రీయై నమః

శ్రీవేంకటేశాయనమః

# పంచాఙ్గ విషయ విజ్ఞానమార్గము

భారతదేశమున వేదాంగమగు జ్యోతిశ్శాస్త్రము ప్రతి మానవునకు అవసరమగు సాహాయ్యమును చేయుచున్నది. ఆ జ్యోతిశ్శాస్త్రము జాతకభాగము, ముహూర్తభాగము, సిద్ధాన్తభాగము అని మూడు విధములుగా ప్రచారములోనున్నది. ప్రతి మానవునకు 1 జాతకభాగము, భూతభవిష్యద్వర్తమాన రూపమగు త్రికాల విషయములను చెప్పుచూ జీవయాత్రకు తోడ్పడుచున్నది. 2 ముహూర్తభాగము, కార్యసిద్ధిని శుభఫలములను సమకూర్చుచు సాహాయ్య మాచరించుచున్నది. 3 సిద్ధాంతభాగము, పంచాంగరూపముగా నేర్పడి, దైనందినయాత్రలో సర్వవిధముల సాహాయ్య మాచరించుచున్నది.

ఈ భాగములన్నియు కాలమునకు సంబంధించి యున్నవిగా తెలియదగియున్నది:

సమయ వేత్తలు, ఆ కాలమును వత్సరము, అయనము, ఋతువు, మాసము, పక్షము, దినము అని ఆరువిధములుగా విభజించి ధర్మాచరణమునకు శ్రేయఃప్రాప్తికి మార్గమును చూపి యున్నారు.

1. వత్సరము — అయిదు విధములు :

చాంద్రవత్సరము, సౌరవత్సరము, సావనవత్సరము, నాక్షత్రవత్సరము, బార్హస్పత్య వత్సరము.

1 చాంద్రవత్సరము : అనగా శుక్లప్రతిపత్ మొదలు దర్శాన్తములగు చైత్రాదిమాసములు 12 కలదై 354 దినములు కలిగియుండును. ఈ చాంద్రవత్సరము ప్రభవాది అరువది నామములు కలదైయున్నది.

2 సౌరవత్సరము : అనగా మేషాది ద్వాదశరాశులయందు రవిసంక్రమణముచే నేర్పడి 365 దినములు కలిగియుండును.

3 సావనసంవత్సరము : అనగా మాసమునకు ముప్పది దినముల చొప్పున 360 దినములు కలదైయుండును. ఇది యుగమన్వంతాది విభాగక్రమమును తెలియచేయును.

4 నాక్షత్రవత్సరము : అనగా అశ్వని మొదలుగు 27 నక్షత్రములయందు చంద్ర సంచారముచేత యేర్పడిన 12 మాసములుకలదై 324 దినములు కలిగియుండును.

5 బార్హస్పత్యసంవత్సరము : అనగా మేషాది రాశులయందు బృహస్పతిసంచారముచేత యేర్పడి 361 దినములు కలిగి యుండును.

2. అయనము — రెండు విధములు : దక్షిణాయణము — ఉత్తరాయణము

1 దక్షిణాయనము — అనగా సూర్యునియొక్క కటక సంక్రమణము మొదలు ఆరు రాశులయందు సంచారముచేత యేర్పడునది. అప్పుడు భూమధరేఖకు దక్షిణముగా సంచరించును.

2 ఉత్తరాయణము — అనగా సూర్యునియొక్క మకర సంక్రమణము మొదలు ఆరురాశులయందు సంచారముచేత యేర్పడునది. అప్పుడు భూమధ్యరేఖకుఉత్తరముగా సంచరించున.

3. ఋతువు — రెండు విధములు : సౌరము — చాంద్రములని

1 సౌరము — అనగా సూర్యునియొక్క రాశి ద్వయ సంచారముచే యేర్పడి వసంతాది ఆరునామములు కలిగియున్నది.

2 చాంద్రము — అనగా చైత్రాదిమాస ద్వయ రూపమై వసంతాది ఆరు నామములు కలిగియున్నది.

4. మానము — నాలుగు విధములు : చాంద్రము — సౌరము — సావనము — నాక్షత్రము.

1 చాంద్రమానము — అనగా శుక్ల ప్రతిపత్ మొదలు దర్శాన్తముగాని కృష్ణప్రతిపత్ మొదలు పూర్ణిమాన్తముగాని చాంద్రమానము అని రెండు విధములుగా నున్నవి. అది చైత్రాదినామములు కలిగియున్నది.

దర్శాన్తమానము — ముఖ్యపక్షము : పూర్ణిమాన్తమానము — వింధ్యకు ఉత్తరదేశమునందు గ్రహింపదగియున్నది.

2 సౌరమానము — అనగా కొందరు సూర్యుని మీనరాశి సంక్రమణము ప్రారంభించియు, కొందరు మేషరాశి సంక్రమణము ప్రారంభించియు, చైత్రాదిమాసములను చెప్పుచున్నారు.

3 సావనమానము — అనగా ముప్పది దినములుగలదై యుండును.

4 నాక్షత్రమానము — అనగా చంద్రుడు అశ్విని మొదలు 27 నక్షత్రములయందు సంచరించు కాలము.

5. పక్షము — రెండు విధములు: శుక్లపక్షము — కృష్ణ పక్షము

1 శుక్లపక్షము — అనగా శుక్ల ప్రతిపత్ మొదలు పూర్ణిమాన్త పక్షము.

2 కృష్ణపక్షము — అనగా బహుళ ప్రతిపత్ మొదలు దర్శాన్తపక్షము.

6. దినము — అనగా :

అరువది ఘడియల కాలము. అది సూర్యోదయము మొదలు తిరిగి సూర్యోదయమువరకు గల కాలము. ఇటుల ఆరు విధములగు కాలమును తెలియజేయుటకు ప్రవర్తించునది పంచాంగము. ఇది మానవులకు కల్పవృక్షమువంటిది. అట్టి పంచాంగమును వివరణములతోను, విశేషములతోను తెలియుటకు మార్గమును చూడుము.

(1) పంచాఙ్గము : అనగా అయిదు అంగములు కలది. 1 తిథి, 2 వారము, 3 నక్షత్రము, 4 యోగము, 5. కరణము.

తిథులు 15 : 1 పాడ్యమి, 2 విదియ, 3 తదియ, 4 చవితి, 5 పంచమి, 6 షష్ఠి, 7 సప్తమి, 8 అష్టమి, 9 నవమి, 10 దశమి, 11 ఏకాదశి, 12 ద్వాదశి, 13 త్రయోదశి, 14 చతుర్దశి 15 ○ పూర్ణిమ, ● అమావాస్య.

వారములు 7 : 1 ఆదివారము, 2 సోమవారము, 3 మంగళవారము, 4 బుధవారము, 5 గురువారము, 6 శుక్రవారము, 7 శనివారము,

నక్షత్రములు 27 : 1 అశ్విని, 2 భరణి, 3 కృత్తిక, 4 రోహిణి, 5 మృగశిర, 6 ఆర్ద్ర, 7 పునర్వసు, 8 పుష్యమి, 9 ఆశ్లేష, 10 మఖ, 11 పుబ్బ, (పూర్వఫల్గుని) 12 ఉత్తర, (ఉత్తరఫల్గుని) 13 హస్త, 14 చిత్ర, 15 స్వాతి, 16 విశాఖ, 17 అనూరాధా, 18 జ్యేష్ఠ, 19 మూల, 20 పూర్వాషాఢ, 21 ఉత్తరాషాఢ, (అభిజిత్) 22 శ్రవణం, 23 ధనిష్ఠ, 24 శతభిషం, 25 పూర్వాభాద్రా, 26 ఉత్తరాభాద్రా, 27 రేవతి.

యోగములు 27 : 1 విష్కంభం, 2 ప్రీతి, 3 ఆయుష్మాన్, 4 సౌభాగ్యం, 5 శోభనం, 6 అతిగండం, 7 సుకర్మ, 8 ధృతి, 9 శూలం, 10 గండం, 11 వృద్ధి, 12 ధ్రువము, 13 వ్యాఘాతము, 14 హర్షణము, 15 వజ్రము, 16 సిద్ధి, 17 వ్యతీపాత్, 18 వరియాన్, 19 పరిఘ, 20 శివం, 21 సిద్ధం, 22 సాధ్యం, 23 శుభం, 24 శుక్లం, 25 బ్రాహ్మం, 26 ఐంద్రం, 27 వైధృతి.

కరణములు 11 : 1 బవ, 2 బాలవ, 3 కౌలవ, 4 తైతుల, 5 గరజి, 6 వణజి, 7 భద్ర, 8 శకుని, 9 చతుష్పాత్, 10 నాగవం, 11 కింస్తుఘ్నం.

పక్షములు 2 : 1 శుక్లపక్షము. (చంద్రునకు కళలు వృద్ధియగు దినములు).
2 కృష్ణపక్షము. (చంద్రునకు కళలు తగ్గిపోవు దినములు).

సూచన: పంచాంగములో ఈ తిథి, వార, నక్షత్ర యోగ కరణములయొక్క ప్రథమాక్షరములను చూచి తిథి, వార, నక్షత్ర యోగ కరణములుగా చదువుకొన వలయును.

(2) మాసముల వివరణము :

| చాంద్ర | సౌర | ద్రావిడ | శాలి | | ఇంగ్లీషు | |
|---|---|---|---|---|---|---|
| చైత్రము | మేషం | చిత్రి | చైత్ర | 30 | జనవరి | 31 |
| వైశాఖము | వృషభం | వైయ్యాశి | వైశాఖ | 31 | ఫిబ్రవరి | 28 |
| జ్యేష్ఠము | మిథునం | ఆని | జ్యేష్ఠ | 31 | మార్చి | 31 |
| ఆషాఢము | కర్కాటకం | ఆడి | ఆషాఢ | 31 | ఏప్రియల్ | 30 |
| శ్రావణము | సింహం | ఆవణి | శ్రావణ | 31 | మే | 31 |
| భాద్రపదము | కన్య | పెరటాసి | భాద్రపద | 31 | జూన్ | 30 |
| ఆశ్వయుజము | తుల | అల్పిసి | ఆశ్వన | 30 | జూలై | 31 |
| కార్తీకము | వృశ్చికం | కార్తికి | కార్తికి | 30 | ఆగస్టు | 31 |
| మార్గశిరము | ధనుస్సు | మార్గళి | మార్గశీర్ష | 30 | సెప్టెంబరు | 30 |
| పుష్యము | మకరం | తై | పౌష | 30 | అక్టోబరు | 31 |
| మాఘము | కుంభం | మాసి | మాఘ | 30 | నవంబరు | 30 |
| ఫాల్గుణము | మీనం | పంగుని | ఫాల్గుణ | 30 | డిశంబరు | 31 |

సూచన : శాలి, ఇంగ్లీషు, నెలలలో ప్రక్కనగల సంఖ్యలు ఆ నెలలకు గల రోజులుగా తెలియవలెను.

(3) చాంద్రమానమున మాసనామనిర్ణయము ఇట్లు యేర్పడెను.

| | | | | |
|---|---|---|---|---|
| పూర్ణిమయందు | చిత్రా | నక్షత్రముకల | మాసము | చైత్రమాసము |
| ,, | విశాఖా | ,, | ,, | వైశాఖమాసము |
| ,, | జ్యేష్ఠ | ,, | ,, | జ్యేష్ఠమాసము |
| ,, | పూర్వాషాఢ, ఉత్తరాషాఢ | | | ఆషాఢమాసము |
| ,, | శ్రవణ | ,, | ,, | శ్రావణమాసము |
| ,, | పూర్వాభాద్ర, ఉత్తరాభాద్ర | | | భాద్రపదమాసము |
| ,, | అశ్వని | ,, | ,, | అశ్వియుజమాసము |
| ,, | కృత్తిక | ,, | ,, | కార్తీకమాసము |
| ,, | మృగశిర | ,, | ,, | మార్గశిరమాసము |
| ,, | పుష్యమి | ,, | ,, | పుష్యమాసము |
| ,, | మఖ | ,, | ,, | మాఘమాసము |
| ,, | పూర్వఫల్గుని, ఉత్తరఫల్గుని | | | ఫాల్గుణమాసము |

(4) సౌరమానమున మాసనామనిర్ణయము ఇట్లు యేర్పడెను.

| | | | | |
|---|---|---|---|---|
| సూర్యుడు | మేష | లగ్నమున ప్రవేశించినది | మొదలు | మేషమాసము |
| ,, | వృషభ | ,, | ,, | వృషభమాసము |
| ,, | మిథున | ,, | ,, | మిథునమాసము |
| ,, | కర్కాటక | ,, | ,, | కర్కాటకమాసము |
| ,, | సింహ | ,, | ,, | సింహమాసము |
| ,, | కన్య | ,, | ,, | కన్యామాసము |
| ,, | తులా | ,, | ,, | తులామాసము |
| ,, | వృశ్చిక | ,, | ,, | వృశ్చికమాసము |
| ,, | ధనుస్సు | ,, | ,, | ధనుర్మాసము |
| ,, | మకర | ,, | ,, | మకరమాసము |
| ,, | కుంభ | ,, | ,, | కుంభమాసము |
| ,, | మీన | ,, | ,, | మీనమాసము |

(5) ద్రావిడమాసములు, సౌరమానమునననుసరించి సూర్యుడు మేషము, వృషభము మొదలగు లగ్నములయందు ప్రవేశించిన దినములయందే చిత్రి, వైయ్యాశి మొదలగు మాసములు ప్రారంభమగు చున్నవి. చాంద్రమానచ్ఛాయ ననుసరించి సామాన్యముగా ఆమాసముల నామములు యేర్పడుచున్నవిగా భావించవలెను.

(6) శాలిశకమాసములు, సౌరమానము ననుసరించి సూర్యునియొక్క మేషసంక్రమణమునకు ముందుగా మేషాయనము ప్రారంభమగుచున్నది. ఆ మేషాయన ప్రారంభదినమే శాలిశక చైత్రమాస ప్రారంభదినము. ఇటులనే సూర్యునియొక్క వృషభాది సంక్రమణములకు ముందుగా వృషభాద్యయన ములు ప్రారంభమగుచున్నవి. ఆ వృషభాద్యయన ప్రారంభదినములే శాలిశక వైశాఖాదిమాస ప్రారంభ దినములగుచున్నవి. ఇటుల శాలిశకమాసములు సౌరమానముననుసరించి ప్రారంభమగుట, చాంద్ర మానము ననుసరించి చైత్ర వైశాఖాది నామములు యేర్పడుట అని తెలియదగియున్నది. ముఖ్యాంశమేమన సూర్యునియొక్క మేషాదిలగ్న సంక్రమణముల ననుసరించి ద్రావిడమాసములు చిత్రి, వైయ్యాశి అను మొదలగు మాసనామములు ప్రారంభమగుచున్నవి. సూర్యునియొక్క మేషాద్యయనముల ననుసరించి శాలిశకమాసములు చైత్ర, వైశాఖ మొదలగు మాసములు ప్రారంభమగుచున్నవిగా తెలియదగియున్నది రెంటికి మాసముల నామములు చాంద్రమానచ్ఛాయలోనే యేర్పడుచున్నవి గాని వేరుగాదు అని తెలియదగి యున్నది.

(7) 1. చైత్రశుద్ధపాడ్యమి - చాంద్రమాన సంవత్సర ప్రారంభమగును. 2. మేషమాసము 1 వ తేదీ సూర్యుని మేషసంక్రమణ ప్రారంభమే సౌరమాన సంవత్సర ప్రారంభమగును. 3. చిత్రినెల 1 వ తేదీ ద్రావిడ సంవత్సర ప్రారంభమగును. 4. సూర్యుని మేషాయన ప్రారంభమే చైత్ర 1 వ తేది శాలివాహనశక వత్సరారంభమగును. 5. జనవరి 1 వ తేది హూణశకవత్సర ప్రారంభమగును. ఇటులనే భారతదేశమున పలువిధములగు సంవత్సరములు, తత్ప్రారంభములున్నూ కలిగియున్నవి.

(8) విశేషములు — హూణశక సంవత్సరములను నాలుగుచే భాగించిన శేషము సున్న వచ్చిన యెడల ఆ సంవత్సరమునకు లీప్ సంవత్సరమని పేరు. అట్లు లీప్ సంవత్సరములో ఫిబ్రవరినెలకు 29 దినములు వచ్చును. శాలివాహనశక వత్సరములను నాలుగుచే భాగించిన శేషము రెండువచ్చిన లీప్ సంవత్సరమన బడును. అట్లు లీప్ సంవత్సరములో చైత్ర 31 రోజులు — మామూలు సంవత్సరములో ఆ చైత్ర 30

రోజులుకలదై యుండును. వైశాఖ, జ్యేష్ఠ, ఆషాఢ, శ్రావణ, భాద్రపద ఈ ఐదు నెలలలో ఎల్లప్పుడు ప్రతినెలకు 31 రోజులు ఉండును. మిగతా ఆశ్వయ, కార్తిక, మార్గశీర్ష, పౌష, మాఘ, ఫాల్గుణ, ఈ ఆరునెలలలో ఎల్లప్పుడు ప్రతినెలకు 30 రోజులుండును.

(9) ఋతువులు 6 : 1 వసంతర్తువు, 2 గ్రీష్మర్తువు, 3 వర్షర్తువు, 4 శరదృతువు 5 హేమంతర్తువు, 6 శిశిరర్తువు.

(10) అయనములు 2 : 1 ఉత్తరాయణము అనగా భూమధ్యరేఖకు ఉత్తరమున సూర్యుడు సంచరించుకాలము (మాఘమాసము మొదలు ఆషాఢమాసము వరకు). 2 దక్షిణాయనము అనగా భూమధ్య రేఖకు దక్షిణమున సూర్యుడు సంచరించుకాలము (శ్రావణమాసము మొదలు పుష్యమాసము వరకు) అవి తెలియదగియున్నది.

(11) సంవత్సరములు 60 :

| | | | |
|---|---|---|---|
| 1 ప్రభవ | 16 చిత్రభాను | 31 హేమలంబ | 46 పరిధావి |
| 2 విభవ | 17 సుభాను | 32 విళంబి | 47 ప్రమాదీ |
| 3 శుక్ల | 18 తారణ | 33 వికారి | 48 ఆనంద |
| 4 ప్రమోద | 19 పార్థివ | 34 శార్వరి | 49 రాక్షస |
| 5 ప్రజాపతి | 20 వ్యయ | 35 ప్లవ | 50 నల |
| 6 ఆంగీరస | 21 సర్వజిత్ | 36 శుభకృత్ | 51 పింగళ |
| 7 శ్రీముఖ | 22 సర్వధారి | 37 శోభకృత్ | 52 కాళయుక్త |
| 8 భావ | 23 విరోధి | 38 క్రోధి | 53 సిద్ధార్థి |
| 9 యువ | 24 వికృతి | 39 విశ్వావసు | 54 రౌద్రి |
| 10 ధాత | 25 ఖర | 40 పరాభవ | 55 దుర్మతి |
| 11 ఈశ్వర | 26 నందన | 41 ప్లవంగ | 56 దుందుభి |
| 12 బహుధాన్య | 27 విజయ | 42 కీలక | 57 రుధిరోద్గారి |
| 13 ప్రమాధి | 28 జయ | 43 సౌమ్య | 58 రక్తాక్షి |
| 14 విక్రమ | 29 మన్మథ | 44 సాధారణ | 59 క్రోధన |
| 15 వృష | 30 దుర్ముఖ | 45 విరోధకృత్ | 60 క్షయ |

ఇవి పురాణప్రసిద్ధములగు సంవత్సరములుగా తెలియవలయును. ఇంగ్లీషు సంవత్సరములలో మార్చి, ఏప్రియల్ నెలలలో ఈ సంవత్సరములు ప్రారంభమగును. ఇంగ్లీషు సంవత్సరములలో మార్చి 21, 22 తేదీలలో శాలివాహనశక వత్సరము ప్రారంభమగును.

(12) నవగ్రహములు 9 : 1 సూర్యుడు, 2 చంద్రుడు, 3 కుజుడు, 4 బుధుడు, 5 గురువు, 6 శుక్రుడు, 7 శని, 8 రాహువు, 9 కేతువు.

(13) ద్వాదశరాశులు 12 :— 1 మేషము, 2 వృషభము, 3 మిథునము, 4 కర్కాటకము, 5 సింహము, 6 కన్య, 7 తుల, 8 వృశ్చికము, 9 ధనుస్సు, 10 మకరము, 11 కుంభము, 12 మీనము ఈ రాశులను లగ్నములు అనియు, హోరలనియు వ్యవహరించుచున్నారు. ఈద్వాదశ రాశులలో 1,4,7,10, చరరాసులు 2,5,8,11, స్థిరరాశులు 3,6,9,12, ద్విస్వభావ రాశులుగా తెలియవలెను.

(14) ఈ ద్వాదశరాశులకధిపతులు :
1 మేషమునకు 8 వృశ్చికమునకు = కుజుడు.
2 వృషభమునకు 7 తులకు = శుక్రుడు.
3 మిథునమునకు 6 కన్యకు = బుధుడు.
4 కర్కాటమునకు = చంద్రుడు.
5 సింహమునకు = సూర్యుడు,
9 ధనుస్సుకు 12 మీనము నకు = గురువు
10 మకరమునకు 11 కుంభమునకు = శని

(15) ఈ రాశులు నక్షత్రములవలన యేర్పడుచున్నవి. ఎట్లు అనగా ఒక్కొక్క నక్షత్రమునకు నాలుగు పాదములు. అందుచే 27 × 4 = 108 పాదములు. ఈ పంన్రెండు రాశులకు 108 పాదములు చేర్పవలెను. 12 × 9 = 108 పాదములు గాన ఒక్కొక్కరాశికి 9 పాదములు చేరుచున్నవి. అనగా వివరణ మిట్లు:

| | |
|---|---|
| 1. అశ్వని 4, భరణి 4, కృత్తిక 1 | = 9 పాదములు మేషము |
| 2. కృత్తిక 3, రోహిణి 4, మృగశిర 2 | = 9 పాదములు వృషభము |
| 3. మృగశిర 2, ఆర్ద్రి 4, పునర్వసు 3 | = 9 పాదములు మిథునము |
| 4. పునర్వసు 1, పుష్యమి 4, ఆశ్రేష 4 | = 9 పాదములు కర్కాటకము |
| 5. మఖ 4, పుబ్బ 4, ఉత్తర 1 | = 9 పాదములు సింహము |
| 6. ఉత్తర 3, హస్త 4, చిత్ర 2 | = 9 పాదములు కన్య |
| 7. చిత్ర 2, స్వాతి 4, విశాఖ 3 | = 9 పాదములు తుల |
| 8. విశాఖ 1, అనూరాధా 4, జ్యేష్ఠ 4 | = 9 పాదములు వృశ్చికము |
| 9. మూల 4, పూర్వాషాఢ 4, ఉత్తరాషాఢ 1 | = 9 పాదములు ధనుస్సు |
| 10. ఉత్తరాషాఢ 3, శ్రవణం 4, ధనిష్ఠ 2 | = 9 పాదములు మకరం |
| 11. ధనిష్ఠ 2, శతభిషం 4, పూర్వాభాద్రా 3 | = 9 పాదములు కుంభము |
| 12. పూర్వాభాద్రా 1, ఉ-భాద్రా 4, రేవతి 4 | = 9 పాదములు మీనము |

(16) ఈ నక్షత్రముల వలన యేర్పడు మహాదశలు వివరము.

| | | |
|---|---|---|
| కృత్తిక, ఉత్తర, ఉత్తరాషాఢా | = ఈ 3 నక్షత్రములకు రవి మహాదశా | ఆరు సంవత్సరములకాలము |
| రోహిణి, హస్త, శ్రవణము | = ఈ 3 నక్షత్రములకు చంద్రమహాదశా | పది సంవత్సరములకాలము |
| మృగశిర, చిత్ర, ధనిష్ఠ | = ఈ 3 నక్షత్రములకు కుజమహాదశా | ఏడు సంవత్సరములకాలము |
| ఆర్ద్రి, స్వాతి, శతభిషం | = ఈ 3 నక్షత్రములకు రాహుమహాదశా | పదునెనిమిది సంవత్సరములు |
| పునర్వసు, విశాఖ, పూర్వాభాద్రా | = ఈ 3 నక్షత్రములకు గురుమహాదశా | పదహారు సంవత్సరములు |
| పుష్యమి, అనూరాధా, ఉ-భాద్రా | = ఈ 3 నక్షత్రములకు శనిమహాదశా | పందొమ్మిది సంవత్సరములు |
| ఆశ్రేష, జ్యేష్ఠ, రేవతి | = ఈ 3 నక్షత్రములకు బుధమహాదశా | పదిహేడు సంవత్సరములు |
| మఖ, మూలా, అశ్వని | = ఈ 3 నక్షత్రములకు కేతుమహాదశా | యేడు సంవత్సరములు |
| -పుబ్బ, పూర్వాషాఢా, భరణి | = ఈ 3 నక్షత్రములకు శుక్రమహాదశా | ఇరువది సంవత్సరములు |

మహాదశలు మొత్తము 120 సంవత్సరములుగా తెలియవలసియున్నది. ఈ పై తెలిపిన నక్షత్రములలో జాతకుడు ఏనక్షత్రములో జన్మించెనో ఆ నక్షత్రము జన్మనక్షత్రము, ఆ నక్షత్రమునకు చెప్పిన దశ జననకాల మహాదశగా తెలియవలయును.

(17) భగణము = ద్వాదశరాశ్యాత్మక కాలచక్రము. ఇది రాశి భాగ లిప్త విలిప్త రూపములుగా గుణింపబడుచున్నది. అందు 60 విలిప్తలు 1 లిప్త, 60 లిప్తలు 1 భాగ, 30 భాగలు 1 రాశి, 12 రాశులు 1 భగణము ఈ భగణము-సప్తవింశతి నక్షత్రాత్మకమును అగుచున్నది. చూడుము భగణము= 12 రాశులు మరియు 27 నక్షత్రములు నక్షత్రమునకు 4 పాదముల చొప్పున 108 పాదములు కలది అగుచున్నది.

## దివాహోరాచక్రము

(ప్రతిహోరయు సూర్యోదయము మొదలు ఒక్కొక్క గంటకాలము చొప్పున తిరిగి సూర్యోదయము వరకు జరుగుచుండును)

| వారం | 6మొ 7వ | 7-8 | 8-9 | 9-10 | 10-11 | 11-12 | 12-1 | 1-2 | 2-3 | 3-4 | 4-5 | 5-6 |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| ఆది | సూర్య | శుక్ర | బుధ | చంద్ర | శని | గురు | కుజ | సూర్య | శుక్ర | బుధ | చంద్ర | శని |
| సోమ | చంద్ర | శని | గురు | కుజ | సూర్య | శుక్ర | బుధ | చంద్ర | శని | గురు | కుజ | సూర్య |
| మంగళ | కుజ | సూర్య | శుక్ర | బుధ | చంద్ర | శని | గురు | కుజ | సూర్య | శుక్ర | బుధ | చంద్ర |
| బుధ | బుధ | చంద్ర | శని | గురు | కుజ | సూర్య | శుక్ర | బుధ | చంద్ర | శని | గురు | కుజ |
| గురు | గురు | కుజ | సూర్య | శుక్ర | బుధ | చంద్ర | శని | గురు | కుజ | సూర్య | శుక్ర | బుధ |
| శుక్ర | శుక్ర | బుధ | చంద్ర | శని | గురు | కుజ | సూర్య | శుక్ర | బుధ | చంద్ర | శని | గురు |
| శని | శని | గురు | కుజ | సూర్య | శుక్ర | బుధ | చంద్ర | శని | గురు | కుజ | సూర్య | శుక్ర |

## రాత్రిహోరాచక్రము

| | | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| ఆది | గురు | కుజ | సూర్య | శుక్ర | బుధ | చంద్ర | శని | గురు | కుజ | సూర్య | శుక్ర | బుధ |
| సోమ | శుక్ర | బుధ | చంద్ర | శని | గురు | కుజ | సూర్య | శుక్ర | బుధ | చంద్ర | శని | గురు |
| మంగళ | శని | గురు | కుజ | సూర్య | శుక్ర | బుధ | చంద్ర | శని | గురు | కుజ | సూర్య | శుక్ర |
| బుధ | సూర్య | శుక్ర | బుధ | చంద్ర | శని | గురు | కుజ | సూర్య | శుక్ర | బుధ | చంద్ర | శని |
| గురు | చంద్ర | శని | గురు | కుజ | సూర్య | శుక్ర | బుధ | చంద్ర | శని | గురు | కుజ | సూర్య |
| శుక్ర | కుజ | సూర్య | శుక్ర | బుధ | చంద్ర | శని | గురు | కుజ | సూర్య | శుక్ర | బుధ | చంద్ర |
| శని | బుధ | చంద్ర | శని | గురు | కుజ | సూర్య | శుక్ర | బుధ | చంద్ర | శని | గురు | కుజ |

షరా: చంద్ర శుక్ర హోరలుశుభఫలమును, బుధ కుజ హోరలు మధ్యమఫలమును, సూర్య శని హోరలు అధమ ఫలమును ఇచ్చును. చంద్ర గురు శుక్ర, హోరలయందు రాహుకాలముగామండినను కార్యానుకూలంగామండును. క్షీణ చంద్రుడు, పాపసహిత బుధుడు వీరుపాపులు. అని తెలియవలసియున్నది,

ఇటులనే తిథి, నక్షత్ర, యోగ, కరణములు కూడా సూర్య చంద్ర గమన, స్థితి, వైషమ్యముల చేతను, చంద్రస్థితి, గమనాదుల చేతను, సూర్యచంద్రగతి స్థిత్యాదులచేతను, సూర్యచంద్రుల స్ఫుటరీతి చేతను యేర్పడుచున్నవి. ఇటుల పంచాంగము యేర్పడియున్నది.

విశేషము: సూర్యుడు ద్వాదశరాశ్యాత్మక భచక్రమును పూర్ణముగా చుట్టివచ్చుటచేత 360 దినములు 12 మాసములుగల ఒక సంవత్సరము యేర్పడుచున్నది. ఇట్టి సంవత్సరములు 432000 సంవత్సరముల పరిమితిగల కాలము కలియుగము, 864000 సంవత్సరముల పరిమితిగల కాలము ద్వాపరయుగము, 1296000 సంవత్సరముల పరిమితకాలము త్రేతాయుగము, 1728000 సంవత్సరముల పరిమిత కాలము కృతయుగము, ఈ నాలుగుయుగముల పరిమాణకాలము మొత్తము 4320000 సంవత్సరములు. ఇట్టి పరిమాణముగల కాలమును మహాయుగము అని చెప్పుచున్నారు,

ఇట్టి మహాయుగములు 71 అయిన కాలమును ఒక మనువు పరిపాలించుచున్నాడు. దానిని మన్వంతరము అనుచున్నారు, ఇట్టివి 14 మన్వంతరముల కాలము సృష్టికర్తయగు బ్రహ్మదేవునకు ఒక పగలు అగుచున్నది. ఇటుల బ్రహ్మయొక్క పగటికాలము వెయ్యి మహాయుగములు (అనగా 4320000000 సంవత్సరములు) ఇది ఉదయకల్పము. అవియు ఇంత పరిమాణముగల రాత్రి కాలమును క్షయకల్పమనియు వ్యవహరించుచున్నారు.

1. ఉదయకల్పము అనగా ప్రపంచ రచనాకాలము (పగటికాలము), 2. క్షయకల్పము అనగా బ్రహ్మ నిద్రించుకాలము (రాత్రికాలము). ఈ రెండు కల్పములయొక్క పరిమితికాలము 8640000000 సంవత్సరములు. ఇట్లు ఉదయ క్షయకల్పములు రెండును సృష్టికర్తయగు బ్రహ్మకు అహోరాత్రమగు చున్నది. అనగా బ్రహ్మకు ఒకదినము. ఇట్టి 360 దినములు బ్రహ్మకు ఒక సంవత్సరమగుచున్నది.

ఇట్టి సంవత్సరములు నూరు (శతసంవత్సరములు) బ్రహ్మకు ఆయుర్భాగ్యము కలిగియున్నది. అనాది యగుకాలమునందు ఒక సంకేతము ననుసరించి ఈ చతుర్ముఖబ్రహ్మను 7-వ బ్రహ్మనుగా చెప్పుచున్నారు. శ్రీభారతమున శాన్తిపర్వమున వేదవ్యాసులవారు వివరించినట్లు అఖిల హేయ ప్రత్యనీక కల్యాణగుణా కరుం డును, అఖిలవేద వేదాన్తవేద్యుండును, అఖిలచరా చర సృష్టి స్థితి లయ కర్తయునగు శ్రీమన్నారాయణుని సంకల్పము వలన 1 మానసజన్మ, 2 చాక్షుషజన్మ, 3 వాచికజన్మ, 4 శ్రావణజన్మ, 5 నాసికజన్మ, 6 అండ జన్మ గల ఆరుగురు సృష్టికర్తలు బ్రహ్మలు అనాదికాలంలో ఒక సంకేతకాలం నుంచి ఇప్పటికి గతించినారు.

ఇప్పుడు సప్తమ జన్మయగు (పద్మభూః) నాభికమలమున జన్మించిన చతుర్ముఖుడు సృష్టికర్తృత్వ మును స్వీకరించియున్నాడు. ఈ బ్రహ్మకు ఆయుర్భాగ్యమగు నూరుసంవత్సరములలో యేబది సంవత్సర ములు గడచినవి. (దీనిని పూర్వపరార్థము అనుచున్నారు). ఇప్పుడు ద్వితీయ పరార్థము ప్రారంభమైనది. అనగా 51-వ సంవత్సరము ప్రారంభమైనది. ఆ ప్రథమ సంవత్సరములో ప్రథమమాసము, ప్రథమపక్షము, ప్రథమదినము జరుగుచున్నది. ఆ ప్రథమదినములో పగటికాలములో (ద్వితీయయామమున తృతీయముహూ ర్తము నందు) 13 ఘడియల 42 విఘడియల కాలము గతించినది.

ఈ సమయము లోపల 1 స్వాయంభువ, 2 స్వారోచిష, 3 ఉత్తమ, 4 తామస, 5 రైవత, 6 చాక్షుష అను నామధేయములుగల 6-గురు మనువులు ఒక్కొక్కరు 71 మహాయుగముల కాలమును పరిపాలించి గతించినారు. ఇప్పుడు 7-వ మనువు అగు వైవస్వతమనువు పరిపాలించుచున్నాడు. ఈ వైవస్వతమనువునకు ఆయుర్భాగ్యముగా నేర్పడియున్న 71 మహాయుగముల కాలములో 28-వ మహాయుగములో కలియుగము నడచుచున్నది. 432000 సంవత్సరముల పరిమాణముగల ఆ కలియుగ ములో ఈ రుధిరోద్గారి సంవత్సరము 5084 వ సంవత్సరముగా ప్రారంభమగుచున్నది — అని కాలవిజ్ఞాన సంపన్నులగు మహాశయులు శాస్త్రైకదృక్కులై తెలిసుకొని యున్నారు. ప్రాచీనులగు మనపూర్వులు. అంతర్ముఖులై నియమ నిష్ఠాగరిష్ఠులై పరమేశ్వరోపాసన మొనరించి సర్వజ్ఞు లగుటయేకాక వారి విజ్ఞానమును శాస్త్రములయందు నిక్షేపించి అర్వాచీనులగు మన పూర్వుల ద్వారా మనకందజేయుటచే నీ విజ్ఞానమును బడయగలుగుచున్నామని మనము సంతసించవలసియున్నది.

విశేషములు: సూర్యునియొక్క స్థిరరాశులయందలి సంక్రమణమును "విష్ణుపదం" అనియును ద్విస్వభావ రాశులయందలి సంక్రమణమును "షడశీతి" అనియును.

చరరాశులై సమసూత్రకములగు తులామేషరాశులయందలి సంక్రమణమును "విషువం" అనియును చరరాశులై సమసూత్రకములగు కటకమకరరాశులయందలి సంక్రమణమును "అయనం" అనియును శాస్త్రములు చెప్పుచున్నవి.

## అధికమాసాది విజ్ఞానము

చాంద్రమాసమునందు యే మాసములు సూర్యుని సంక్రమణము లేకయున్నవో అవగా నీరమాసము ప్రారంభము కానేరదో, మాసముయొక్క శుక్లపాడ్యమి మొదలు అమావాస్య వరకు సూర్యుడున్న రాశి చలనములేదో ఆ మాసము అధిక మాసముగా తెలియవగును.

చాంద్రమానమునందు ఏ మాసమునందు సూర్యుడు రెండురాశులయందు ప్రవేశించునో, అనగా రెండు సంక్రమణము లుండునో ఆ మాసము క్షయ మాసముగా తెలియదగినది. దానిని రెండుమాసములుగా వ్యవహరించుచున్నారు.

సంక్రాన్తి శూన్యమగు మాసము అధికమాసము.

సంక్రాన్తిద్వయముతోకూడిన మాసము క్షయ మాసము

అధికమాసము— పూర్వ అధికమాసము మొదలు ముప్పది మాసములకుపైన 8వ మాసమునగాని 9వ మాసమున గాని రాగలదు.

క్షయమాసము 141 సంవత్సరములకుగాని 19 సంవత్సరములకుగాని రాగలదు. అధికమాసమువలె స్వల్పకాలమున రానేరదు. మరియు నా క్షయ మాసము కార్తికమాసముగాని, మార్గశిర మాసముగాని పుష్యమాసముగాని, కాగలదు. ఇతర మాసములు క్షయమాసములు కానేరవు.

యే సంవత్సరమునందు క్షయమాసము వచ్చుచున్నదో, ఆ క్షయమాసమునకు పూర్వమునందు ఒక అధికమాసమున్నూ పరమునందు ఒక అధికమాసమున్నూ తప్పకరాగలవు అనితెలియవలెను.

## సంక్రమణ పుణ్యకాల విజ్ఞానము

1. మేషరాశియందు సూర్యుడు ప్రవేశించిన సంక్రమణమునకు విషువమనిపేరు. ఈ సంక్రమణమునకు పూర్వము 10 ఘడియలకాలము, పరమునందు 10 ఘడియలకాలము విషువపుణ్యకాలము. ఆపుణ్యకాలమునందు స్నానదానములు చేయుట పుణ్యముగా భావించవలెను.

| | | | | |
|---|---|---|---|---|
| 2. | వృషభమునందు | సంక్రమణమునకు | విష్ణుపదమనిపేరు | పూర్వమునందు 16 ఘడియలు పుణ్యకాలము. |
| 3. | మిథునమునందు | ,, | షడశీతి | పరము 16 ఘడియలు |
| 4. | కటకమునందు | ,, | ఆయనము | పూర్వము 30 ఘడియలు |
| 5. | సింహమునందు | ,, | విష్ణుపదము | పూర్వము 16 ఘడియలు |
| 6. | కన్యయందు | ,, | షడశీతి | పరము 16 ఘడియలు |
| 7. | తులయందు | ,, | విషువము | పూర్వము 15 పరము 15 ఘడియలు |
| 8. | వృశ్చికమునందు | ,, | విష్ణుపదము | పూర్వము 16 ఘడియలు |
| 9. | ధనుస్సుయందు | ,, | షడశీతి | పరము 16 ఘడియలు |
| 10. | మకరమునందు | ,, | అయనము | పరము 40 ఘడియలు |
| 11. | కుంభమునందు | ,, | విష్ణుపదము | పూర్వము 16 ఘడియలు |
| 12. | మీనమునందు | ,, | షడశీతి | పరము 16 ఘడియలు పుణ్యకాలము |

ఈ విష్ణుపద, షడశీతి, విషువ, అయన, అనునామములుగల సూర్య సంక్రమణ పుణ్యకాలములలో ఉత్తరోత్తరము పుణ్యమధికముగా తెలియవలెను.

## వాస్తు కర్తరీ విజ్ఞానము

సూర్యుడు భరణీనక్షత్రముయొక్క మూడు నాలుగు పాదములయందు సంచరించు చుండగాను, కృత్తికానక్షత్రము యొక్క 1, 2, 3, 4, పాదములయందు సంచరించు చుండగాను, రోహిణి నక్షత్రముయొక్క మొదటిపాదమునందు సంచరించు చుండగాను, ఆ కాలము కర్తరీయను పేరుతో వ్యవహరింపబడుచున్నది. ఆ కాలమునందు గృహమునకు శంకుస్థాపనమొనరించినను గృహనిర్మాణ మొనరించినను అగ్నిహోత్ర ప్రీతికరములగును అని కాలామృతము, కృష్ణవాస్తు మొదలగు గ్రంథములు చెప్పుచున్నవి.

## కృష్యారంభమునకు యుక్తకాలము

శ్లో॥ మైత్రార్కత్రయరోహిణీ వసుమఘా దస్రోత్తరాంత్యానురే-
షాద్యార్కజ్ఞకవేర్దినేషు శుభదో మధ్యస్తు చాంద్రే దినే।
త్యక్త్వా రిక్తదినాని దగ్ధదివసాన్దర్శావమా వైధృతి-
వ్యాఘాతవ్యతిపాతవిష్టిదివసాః శేషాః కృషౌ శోభనాః॥ (జ్యోతిషపలాలిదర్శిని)

తా॥ అనూరాధ, హస్త, చిత్త, స్వాతి, రోహిణీ, ధనిష్ఠ, మఘ, అశ్విని, ఉత్తరఫల్గుని, ఉత్తరాషాఢ, ఉత్తరాభాద్ర, రేవతి, మూల ఈ నక్షత్రములును, భాను, భౌమ, బుధ, శుక్రవారములును, భూమి దున్నుటకారంభించుటచేత, శుభము గలుగువనియును, సోమవారము మధ్యమమనియును, రిక్తతిథులును, దగ్ధతిథులును, పాడ్యమియును, అమావాస్యయును, అవమయును, వైధృతి, వ్యాఘాత, వ్యతీపాతయోగములును, భద్రాకరణమును, అనువానిని విడిచిపెట్టి, మిగిలినదివసములయందు కృషిని చేయుటకు నూతనముగా ప్రవేశించుటచేత శుభములు గలుగును.

## ఏరువాకకు యుక్తకాలము

శ్లో॥ శూర్పారేందుమఘాదితీ విధిహయశ్రీశత్రయత్ర్యుత్తర-
క్రవ్యాదాంత్యసమీరమిత్రగురుషు క్ష్మాజార్యతీక్ష్ణత్విషామ్।
వారే స్యాద్ధలకర్మ గోంత్యయుగకన్యాచాపకీటే శుభం
తౌళీనక్రఘటాజకర్కిహరిషు ప్రాణఘ్నసస్యక్షయౌ॥
చోరత్రాసపశుఘ్నదాహభుజగత్రాసా భవేయుః క్రమాత్॥

తా॥ విశాఖ, హస్త, మృగశిర, మఖ, పునర్వసు, రోహిణి, అశ్విని, శ్రవణం, ధనిష్ఠ, శతభిషం, ఉత్తర, ఉత్తరాషాఢ, ఉత్తరాభాద్ర, మూల, రేవతి, స్వాతి, అనూరాధ, పుష్యమి, ౧౮ నక్షత్రములయందును, కుజ, గురు, భానువారములయందును, వృషభము, మీనము, మిథునము, కన్య, ధనుస్సు, వృశ్చికము ఈ లగ్నములయందును కృషికర్మనారంభించుటచేత నానావిధములయిన శుభఫలములు గలుగును. తులాలగ్నమునందు కృషికర్మ నారంభించిన ప్రాణహాని గలుగును. మకరమునందారంభించిన సస్యనాశనమును-కుంభమునందారంభించిన చోరభయమును, మేషమునందారంభించిన పశుహానియు, కర్కాటకమునందారంభించిన దహనమును, సింహమందారంభించిన యెడల సర్పముల వలన మనుష్యులకు భయమును గలుగునని తాత్పర్యము.

## చెరుకు, అరటి, మామిడి మొదలగు చెట్లు వేయుటకు యుక్తకాలము

శ్లో॥ రేవత్యుత్తర రోహిణీ గురుకరాదిత్యేషు నక్షత్రంచరే
వాయౌ వారుణ వాజినోశ్చ శశిజేంద్వార్యేషు వారేషు చేత్।
వృక్షస్థాపనబీజవాపనహలప్రారంభకార్యే శుభం
కన్యాకర్కియుగోక్షమీనమకరే సంపూర్ణ ధాత్రీఫలమ్॥

తా॥ రేవతి, ఉత్తర, రోహిణీ, పుష్యమి, హస్త, పునర్వసు, మూల, స్వాతి, శతభిషం, అశ్విని, ఈ పది నక్షత్రములును, గురు, బుధ, సోమవారములును, కన్యా, కర్కాట, మిధున, వృషభ, మీన, మకరరాశులును, అన్ని విత్తనములు నాటుటకు, కృషికర్మనారంభించుటకు, విత్తనములు చల్లుటకును, ప్రశస్తములయినవి. పై చెప్పబడిన కార్యములను ముహూర్తములు చూచి ప్రారంభించిన, సంపూర్ణముగా సకలసస్యములు ఫలించును.

## ఉల్లితోట వేయుటకు యుక్తకాలము

శ్లో॥ రేవత్యశ్విని మైత్రవాయువరుణాదిత్యేంద్రవిష్ణ్వీజ్యమూ-
లార్కార్యేందుషు భానుసోమగురువారేష్వేవ వృద్ధిప్రదమ్।
పూర్ణాయాం మృగమీనకర్కటధనుఃకుంభేషు చారోకృదయే
స్థాప్యం గృంజనముక్తమాహ రితి వాసిష్ఠాత్రిగార్గ్యాదయః॥

తా॥ రేవతి, అశ్విని, అనూరాధ, స్వాతి, శతభిషం, పునర్వసు పుష్యమి, ఉత్తర, హస్త, జ్యేష్ఠ, శ్రవణము, మూల, మృగశీర్షః, ఈ పదమూడు నక్షత్రములును, ఆది, గురు, సోమవారములును, పంచమీ, దశమీ, పూర్ణిమా

